# ANDHRA DESA CHARITRA

BY

DR. MAREMANDA RAMA RAO



---

PUBLISHED UNDER THE AUSPICES OF
THE SOUTHERN LANGUAGES BOOK TRUST, MADRAS.
*Telugu : 40*

---

*PRICE Re. ONE*

FIRST EDITION 5,000
NOVEMBER 1959

*Printed & Published by :*
**SHIVAJI PRESS,**
**Gunj Bazaar, SECUNDERABAD (A. P.)**

# పరిచయము . . .

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భాషా పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప జేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘన కార్యాలను వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సు కోసం, అభ్యుదయం కోసం ఆ మహాపురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిదిగద.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం - ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి, విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయా

లను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింప జేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అందజేసినట్టు అవుతుంది.

ఈ దక్షిణభాషా పుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు,
ఏ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్ ఛాన్సలర్,
మద్రాసు విశ్వవిద్యాలయము.

మద్రాసు,
7-10-1956.

# తొలి పలుకు :

ఆంధ్రుల చరిత్రకు, సంస్కృతికి సంబంధించిన వివిధ విషయము లను గూర్చి ప్రత్యేక కృషిచేసిన పండితులెందరో ఆ యా విషయము లను గురించి బహు గ్రంథముల రచించిరి. కాని, ఆ విషయము లన్నిటిని సామాన్య పాఠకునకు సుబోధముగ నుండునట్లును, సంగ్రహ ముగను వివరించు గ్రంథ మింతవరకును లేనేలేదనవచ్చును ఈ దృష్ట్యా, ఈ గ్రంథము మనకు అత్యంతావశ్యకమైనది. సామాన్య పాఠకునకు ఉపకరించునట్లు సంగ్రహముగనున్నను ఈ గ్రంథము ఆంధ్రుల చరిత్రను అతి ప్రాచీన కాలమునుండి ఆధునికదశ వరకును తేటతెల్లముగ వివరించుచున్నది. రచయిత ఈ గ్రంథాంతమున అనుబంధముగ కూర్చిన గ్రంథముల పట్టిక ఈ విషయములను గురించి ఇంకను వివరముగ దెలిసికొనగోరు పాఠకులకు ఉపయోగపడును. దక్షిణ భారత చరిత్ర పరిశోధక ప్రముఖులలో ఈ రచయిత ఒకరు. కనుక, ఆయనను పాఠకలోకమునకు కొత్తగ పరిచయముచేయవలసిన అగత్యములేదు. ప్రాచీన నాణెముల పరిశోధనలోను, పురావస్తు తత్త్వశాస్త్రములోను ఆయన అధికారి. ఆ కారణమున ఆంధ్రప్రదేశ చరిత్రను గురించిన ఆయన పరిశోధనలు విలక్షణమైనవి. ఇట్టి ఉప యుక్తమైన గ్రంథమును ప్రచురించుటకు కారకులైన దక్షిణభాషా పుస్తక సంస్థ అభినందనీయము.

వైస్ ఛాన్సెలర్ లాడ్జి,
హైదరాబాద్-7,
11 ఏప్రిల్ 1959,

(సం.) డి. ఎస్. రెడ్డి,
వైస్ ఛాన్సెలర్,
ఉస్మానియా విశ్వవిద్యాలయము.

# పీఠిక

ఆంధ్రదేశ చరిత్రను గురించి అనేకమంది పండితులు చిరకాలం నుంచీ పరిశోధనలు సాగిస్తున్నారు. వారి పరిశోధనల ఫలితములు అనేక గ్రంథముల రూపంలోనూ, వ్యాసముల రూపంలోనూ మనకు లభిస్తూన్నవి. వీటిని ఆధారం చేసుకొని ఆంధ్రదేశం యొక్క చరిత్రను వ్రాయడం ఈ నాడు సులభసాధ్యంగా ఉన్నది.

ఈ చిన్న పుస్తకం ఆంధ్రదేశ చరిత్రని సంగ్రహంగా నిరూపిస్తుంది. ఇది అందరికీ తెలియవలెననే ఉద్దేశంతో సామాన్యమైన వ్యావహారిక భాషలో వ్రాయబడింది దీనిలో మనదేశపు చరిత్రకు సంబంధించిన ముఖ్యాంశములు మాత్రమే ఉన్నవి. వివరములను తెలిసికోదలచినవారి ఉపయోగార్థం పుస్తకం చివర ప్రమాణ గ్రంథముల పట్టిక ఇయ్యబడింది విషయం సుకరం కావడానికి ప్రధాన రాజ వంశముల పరిపాలనా కాలములను తెలిపే పట్టిక కూడా ఇయ్యబడింది.

ఈ పుస్తకరచనకు నన్ను ప్రేరేపించిన దక్షిణ భాషా పుస్తక సంస్థ వారికి నేను కృతజ్ఞుడను. దీనికి పరిచయ వాక్యములు దయతో వ్రాసి ఇచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యాయులు శ్రీ. డి. సదాశివరెడ్డిగారికి నా హృదయ పూర్వకవందనములు.

హైదరాబాదు,
2-4-1959.

మారేమండ రామారావు.

# విషయ సూచిక . . .

# ఆంధ్రదేశ చరిత్ర

## పరిచయం :

భారతదేశంలో అనేక భాషాప్రాంతములు చేరి ఉన్నవి. ఈ ప్రాంతములలో ఒక్కొక్కదానిలో బహుసంఖ్యాకులైన ప్రజలకు ఒకే భాష మాతృభాషగానూ, ప్రధాన భాషగానూ ఉన్నది. ఈ యీ భాషలు మాట్లాడే ప్రజలు చిరకాలంనించీ ఈ యీ ప్రాంతములలో నివసిస్తూ ఉండడంవల్ల ఈ ప్రాంతములకు ఒక ప్రత్యేకత వచ్చి, వాటికి ఆ భాషలనుబట్టి పేర్లు వచ్చినవి. దక్షిణాపథంలో మధ్యభాగానికీ, తూర్పుభాగానికీ చిరకాలంనించీ ఆంధ్రదేశం అనే పేరు వర్తిస్తూ ఉన్నది. "ఆంధ్రులు" అనే ఒక జాతి ప్రజలు నివసిస్తూ ఉండడంవల్ల ఈ ప్రాంతానికి ఆంధ్రదేశం అని పేరు వచ్చింది. శ్రీశైల, దాక్షారామ, కాళేశ్వరములనే మూడు చోట్ల గల మూడు లింగముల మధ్య ఉండడంవల్ల ఈ దేశానికి త్రిలింగ అనే పేరున్నూ వచ్చింది. ఈ త్రిలింగ శబ్దమే తెలింగ, తెలింగానా లుగా మారింది.

ఆంధ్రులనే జాతివారు చిరకాలంనించీ దక్షిణాపథంలో నివసిస్తూ వచ్చారు. ఈ ఆంధ్రుల ప్రశంస ఐతరేయ బ్రాహ్మణం లోనూ, శ్రీమద్రామాయణంలోనూ, భారత భాగవతముల

లోనూ, పురాణములలోనూ అనేకచోట్ల కనిపిస్తుంది. అప్పటి నించి నేటివరకూ ఈ ప్రాంతంలో నివసిస్తూ వచ్చిన ప్రజలను ఇతర ప్రాంతములవారు ఆంధ్రులనే ఉదహరిస్తూ వచ్చారు.

ఆంధ్రదేశం చాలా విశాలమైనది. దీనికి తూర్పున బంగాళాఖాతమూ, ఉత్తరాన మధ్యభారతమూ, పడమట మహారాష్ట్ర కర్ణాటకములూ, దక్షిణాన ద్రవిడ దేశమూ సరిహద్దులు. ఈ భాగం 1,22,574 చదరపు మైళ్ళ వైశాల్యం కలది. దీనిలో సుమారు 4 కోట్లమంది ప్రజలు నివసిస్తున్నారు. వీరుకాక సుమారు 40 లక్షలమంది ఆంధ్రులు ఇతర ప్రాంతములలో ఉన్నారు.

ఆంధ్ర ప్రజలలో కొంత వైవిధ్యమూ, కొంత ఏకతా కనిపిస్తాయి. సరిహద్దులలో ఉన్న ప్రజలమీదా, వారి భాష మీదా, ఆచార వ్యవహారములమీదా ప్రక్కన ఉన్న ప్రాంతముల భాషలయొక్కా, ఆచార వ్యవహారములయొక్కా ప్రభావం కనిపిస్తుంది. అలాగే తెలింగానా ప్రాంతం చిరకాలం మహమ్మదీయుల పరిపాలనలో ఉండడంవల్ల, ఇక్కడి ప్రజల భాషమీద ఉర్దూభాషయొక్క ప్రభావం కనిపిస్తుంది. ఇతర ఆంధ్ర ప్రాంతములు ఇంగ్లీషువారి ఏలుబడిలో ఉండడంవల్ల వాటి భాషమీద ఇంగ్లీషు భాషా ప్రభావం కనిపిస్తుంది. గడచిన శతాబ్దుల రాజకీయ పరిస్థితులు కారణంగా అనేక సమయము లలో ఓఢ్ర, మహారాష్ట్ర, కర్ణాటక, ద్రవిడ ప్రాంతముల ప్రజలు

కొందరు ఆంధ్రదేశానికి వచ్చి ఇక్కడ స్థిరపడిపోయారు. ఈ విధంగా కొంత వైవిధ్యం ఏర్పడినా ఆంధ్రుల ఏకతకు భంగం కలగలేదు. యావదాంధ్రమూ అనేకసార్లు ఒకే సామ్రాజ్యంగా ఏర్పడి రాజకీయైక్యతను అనుభవించింది. సాతవాహన, కాకతీయ, విజయనగర, ఖుతుబ్ షాహీ, అసఫ్ జాహీ రాజ వంశములవారు కొంతకాలం యావదాంధ్రదేశాన్నీ పరిపాలించారు. అంతే కాకుండా దేశం అప్పుడప్పుడు వేరు వేరు రాజ్యములుగా ఏర్పడినా, పాలకులు వేరైనా ప్రజల జీవితం అన్ని భాగములలోనూ ఒకే విధంగా సాగుతూ వచ్చింది. భాష ఒక్కటీ, వాఙ్మయం ఒక్కటీ, బాహుళ్యంమీద మతం ఒక్కటీ, కళలు ఒకేవిధమైనవీ కావడంవల్ల ఆంధ్ర ప్రజలలో బలమైన ఐకమత్యము వర్ధిల్లింది. ఈ ఏకత ఆంధ్రులకు ఒక ప్రత్యేకతనూ, వైశిష్ట్యాన్నీ కల్పించింది.

భౌతికంగా ఆంధ్రదేశం రెండు భాగములుగా ఉన్నది. వీటిలో ఒకటి తీరభాగమూ, రెండవది పీఠభూమి భాగమూ. ఈ తీరము బంగాళాఖాతం అనే సముద్రాన్ని అంటి ఉన్నది. దీని పొడవు సుమారు 600 మైళ్ళు, వైశాల్యం ఒక్కొకచోట 100 మైళ్ళవరకూ ఉన్నది. కృష్ణా, గోదావరీ మహానదులూ, పెన్నానదీ బంగాళాఖాతంలో కలియడంవల్లనూ, అవి తీసుకొని వచ్చిన ఒండ్రుమట్టివల్లనూ ఈ తీరం చాలా సారవంతమైన భాగంగా ఏర్పడింది. ఒక్క కృష్ణా గోదావరి డెల్టాలలోనే యావదాంధ్రదేశాన్నే కాకుండా ఇతర ప్రాంతములనుకూడా

పోషించడానికి చాలినన్ని ఆహార వస్తువులు ఉత్పత్తి అవుతాయి. ఈ తీరంలో పూర్వం అనేకములైన రేవులు ఉండేవి. వాటి ద్వారా ఆనాటి ఆంధ్రులు విదేశములతో విరివిగా వర్తకం సాగించారు. ఈ తీర భాగానికి పడమటగా తూర్పు కనుమలు అనే పర్వతపంక్తి ఉన్నది. ఈకొండలలో కొండవీడూ, కొండపల్లీ, బెల్లంకొండావంటి బలిష్ఠములైన దుర్గములు ఉండేవి. ఈ కొండలమీద అనేక బౌద్ధ క్షేత్రములూ, సింహాచలం, కోర్కు కొండ, కోటప్పకొండ, అహోబిలం, శ్రీశైలం, వేంకటాచలం వంటి కొండలమీద హిందూ పుణ్యక్షేత్రములూ ఉన్నవి. ఈ కొండలమీదా, చుట్టుపట్లా ఉన్న అడవులలో జీవితావసరములైన వస్తువులు ఎన్నో లభిస్తాయి. తూర్పు కనుమలకు పడమటగా పీఠభూమి ఉన్నది. ఇక్కడి నేల చాలా భాగం నిస్సారమైనది. మధ్యయుగంలో రాజులూ, శ్రీమంతులూ పాకాల, పాలంపేట, కంభంవంటి చోట్ల లోయలకు అడ్డకట్టలు కట్టి పెద్ద పెద్ద తటాకములను ఏర్పరచారు. ఇందుమూలంగా కొంత భూమి సాగులోకి వచ్చింది. ఈ ప్రాంతంలో అక్కడక్కడ కొంత నల్లరేగడి నేల ఉన్నది.

ఆంధ్రదేశంలో చాలాభాగం ఈ నాడు తిరిగి రాజకీయ ఐక్యతను పొంది, ఆంధ్రప్రదేశమనే ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది. దీని వైశాల్యం 1,060,41 చదరపు మైళ్ళు. దీనిలో 3,12,60,000 జనాభా ఉన్నది, 293 పట్టణములూ,

26,450 గ్రామములూ గల ఈ భాగం 20 జిల్లాలుగా విభజింపబడి ఉన్నది. దీనిమీద ప్రభుత్వంవారికి సాలీనా 64 కోట్ల రూపాయల ఆదాయం వస్తుంది.

ఈ ప్రాంతపు చరిత్ర తరువాత వచ్చే అధ్యాయములలో సంగ్రహంగా చెప్పబడుతుంది.



## సాతవాహన సామ్రాజ్యం :

ఆంధ్ర దేశం యొక్క సక్రమమైన చరిత్ర క్రీ. పూ. 236 తో ప్రారంభం అవుతుంది. ఆ సంవత్సరంలో మౌర్య చక్రవర్తి అయిన అశోకుడు మరణించాడు. అనంతరం అతని పుత్రులూ, పౌత్రులూ తగవులాడుకొని అతని సామ్రాజ్యంలో భాగమైన ఉత్తరాపథాన్ని తమలో తాము పంచుకొన్నారు. దక్షిణాపథం సంగతి వారికి ఎవరికీ పట్టలేదు. అందువల్ల ఇక్కడ అరాజకం ఏర్పడింది. ఈ సమయంలో ఆంధ్రులు ఒక స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించారు. ఈ రాజ్యం చిరకాలం వర్ధిల్లి సాతవాహన సామ్రాజ్యం అని ప్రసిద్ధి చెందింది.

ఆ రోజులలో దక్షిణాపథంలో రఠికులు, భోజకులు, పుళిందులు, శబరులు, ఆంధ్రులు మొదలయిన జాతులవారు నివసిస్తూ ఉండేవారు. వీరిలో రఠికులు మహారాష్ట్రంలోనూ, భోజకులు బేర్హారులోనూ, పుళిందులు వింధ్య పర్వతముల ప్రాంతంలోనూ, శబరులు తూర్పు కనుమలలోనూ, ఆంధ్రులు దక్షిణాపథంలోని మధ్యభాగంలోనూ, తూర్పు భాగంలోనూ ఉండేవారు. ఈ జాతులవారిలో ఆంధ్రులు చాలా బలవంతులుగా ఉండేవారు. ఈ ఆంధ్రుల జాతియొక్క నాయకులలో ఒకడైన సాతవాహనుడు ముందుకు వచ్చి, నేటి హైదరాబాదు ప్రాంతమును స్వాధీనపరచుకొని, దానిని ఒక రాజ్యంగా ఏర్పరచుకొని,

స్వతంత్రుడుగా పరిపాలించాడు. ఇతని సంతతివారు ముప్పయి మంది ఇతని పేరునే తమ వంశ నామంగా పెట్టుకొని, ఈ రాజ్యాన్ని, ఒక మహా సామ్రాజ్యంగా విస్తరించి, దీనిని సుమారు నాలుగున్నర శతాబ్దులకాలం పరిపాలించారు.

సాతవాహనుని అనంతరం అతని కుమారుడు సిముకుడు రాజ్యానికి వచ్చాడు. ఈ సిముకుడు అనేకమంది ఆంధ్ర నాయకులను కూడగట్టుకొని,మహారాష్ట్రంమీద దండెత్తి పోయి ఆ దేశాన్ని జయించాడు. దీనితో సాతవాహన రాజ్యం ఒక సామ్రాజ్యం అయింది. ఈ మహారాష్ట్రం తన వశంనించి తప్పి పోకుండా ఉంచుకునేటందుకని సిముకుడు అక్కడ నివసిస్తూ ఉండిన రఠికులనే తెగవారి నాయకుని కుమార్తె నాగానీక అనే ఆమెను తన కుమారుడైన (శ్రీ) సాతకర్ణికి వివాహం చేశాడు. కొంత కాలానికి (శ్రీ) సాతకర్ణి లేక మొదటి సాతకర్ణి రాజు అయ్యాడు. ఇతడు తండ్రిని మించిన పరాక్రమశాలి. ఈ కాలానికి మౌర్యుల పరిపాలనం అంతరించి శుంగవంశీయులు మగధరాజ్యాన్ని పాలిస్తూ ఉండేవారు. ఆ రాజుల బలహీనతను కనిపెట్టి (శ్రీ) సాతకర్ణి వారి రాజ్యంలో చేరి ఉండిన మాళవ దేశాన్ని జయించి, ఆ విజయానికి సూచకంగా ఒక అశ్వమేధ యాగం చేశాడు. ఈ కాలంలో ఖారవేలుడనే శూరుడు తూర్పు తీరాన ఉన్న కళింగదేశాన్ని పరిపాలించేవాడు. ఈ ఖారవేలుడు రెండు మూడుసార్లు సాతవాహన సామ్రాజ్యం మీద దండెత్తి వచ్చాడు. ఇందువలన కలిగిన ఉపద్రవములను

తట్టుకొని, శత్రుపీడను అణచివేసి (శ్రీ) సాతకర్ణి మరి ఒక అశ్వమేధం చేశాడు. ఆమీద అతడు రాజసూయయాగంకూడా చేసి, "దక్షిణాపథపతి" అనే బిరుదు వహించి, చక్రవర్తిగా పరిపాలన సాగించాడు. తరువాత కొంతకాలానికి రెండవ సాతకర్ణి రాజ్యానికి వచ్చాడు. ఇతడున్నూ శూరుడే. ఇప్పటికి ఖారవేలుని వంశీకులు బలహీనులు కావడంవల్ల ఈ మహారాజు కళింగదేశంమీద దండెత్తిపోయి దానిని జయించాడు. ఇంకొక దండయాత్ర సాగించి ఇతడు నేటి మధ్యభారతంలో చాలా భాగాన్నికూడా జయించాడు. ఇతని కాలంలో శకులనే విదేశీయులు మన దేశంమీద దండెత్తి వచ్చి ఉత్తరాపథాన్ని అలజడి పరచారు. వీరు దక్షిణంగా దండెత్తి వస్తే సాతకర్ణి మహారాజు వీరిని ఓడించి తరిమి వేశాడు.

మరి కొద్దికాలానికి ఈ శకుల జాతికి చెందిన క్షహరాట వంశీకులు దక్షిణాపథంలోని పడమటి భాగాన్ని, మాళవ దేశాన్నీ వశపరచుకున్నారు. అందువల్ల సాతవాహనులు కొంత దెబ్బ తిన్నారు. కొంతకాలంపాటు వీరు కాలానికి కట్టుబడి, ఉన్న రాజ్యాన్నే పరిపాలించుకుంటూ వచ్చారు. ఆ తరువాత కుంతల సాతకర్ణి రాజ్యానికి వచ్చాడు. ఇతడు ఉత్తరాపథంలో కొంత భాగాన్ని జయించి పరిపాలించాడు. ఇతని ఆస్థానంలో శర్వవర్మ, గుణాఢ్యుడు అనే ఇద్దరు గొప్ప పండితులు మంత్రులుగా ఉండేవారు. పిమ్మట మొదటి పులోమావి అధికారానికి వచ్చి, మగధ రాజ్యాన్ని జయించాడు. మరి కొంతకాలానికి

హాలుడు రాజ్యానికి వచ్చాడు. ఇతడు గొప్ప కవీ, కవి పోషకుడూను. తరువాత వచ్చిన రాజులు అసమర్థులు కావడం వల్ల వారు ఉత్తరాపథంలోని భాగాలను పోగొట్టుకున్నారు.

క్రీ. శ. 78వ సంవత్సరంలో గౌతమీపుత్ర సాతకర్ణి సాతవాహన సామ్రాజ్యానికి ఏలిక అయినాడు. ఇతడు ప్రతిభాశాలీ, శూరుడూ, గొప్ప యోధుడూనూ. ఆనాడు సంకుచితంగా ఉండిన సామ్రాజ్యం చూచీ, తన పూర్వుల కాలంలో ఉండిన దాని వైశాల్యం తలచుకునీ, విచారించి ఈ మహారాజు తన వంశ గౌరవాన్నీ, సామ్రాజ్య గౌరవాన్నీ ఇనుమడింప చేయవలెనని సంకల్పించుకున్నాడు. ఒక ప్రబలమైన సైన్యాన్ని సమకూర్చుకొని ఇతడు అనేక దండయాత్రలు సాగించాడు. పశ్చిమంగా దండెత్తి పోయి ఈ మహారాజు క్షహరాటుల వంశాన్ని నిర్మూలం చేసి, వారి రాజ్యాన్ని ఆక్రమించాడు. ఉత్తరదిక్కుగా పోయి రాజపుతానాలోని తూర్పుభాగాన్నీ, మాళవదేశాన్నీ ఆక్రమించాడు. దక్షిణంగా పోయి మైసూరు రాష్ట్రంలోని ఉత్తరభాగాన్ని జయించి, ద్రవిడదేశంలోకి చొచ్చుకు పోయాడు. ఈ విధంగా అనేక రాజ్యములనూ, రాజులనూ జయించి, ఇతడు "రాజరాజు" అనే బిరుదం వహించాడు. ఆ కాలంలో యవనులూ, శకులూ, పహ్లావులూ అనే విదేశీయులు దేశంలో అలజడి కలిగిస్తూ ఉన్నందున ఈ మహారాజు వీరందరినీ అణిచివేశాడు. ఇతడు చక్కని గుణశీలములను కలిగి ఉండి ప్రజలతో సుఖదుఃఖము

లనూ, సిరిసంపదలనూ సమానంగా పంచుకునేవాడు. తాను ఓటమి ఎరుగని విజేత అయి ఉండిన్నీ, ఈ సాతకర్ణి విద్వాంసులనూ, వృద్ధులనూ గౌరవంగా చూచి, వారిని ఆదరించేవాడు. ఇతని అనంతరం ఇతని పెద్ద కొడుకు పులోమావి రాజ్యానికి వచ్చాడు. ఇతని రాజ్యకాలంలో సామ్రాజ్యంలో చాలాభాగం చెదరకుండా ఉండినది. తరువాత శకులలో ఒక కుటుంబం వారు మాళవదేశాన్ని జయించి, ఉజ్జయిని రాజధానిగా ఒక రాజ్యం స్థాపించారు. వీరిలో ప్రసిద్ధుడైన రుద్రదాముడనే రాజు దక్షిణంగా దండెత్తి వచ్చి, మహారాష్ట్రం మొదలయిన పశ్చిమ భాగములను స్వాధీనం చేసుకున్నాడు. అందువల్ల కొంతకాలం వరకూ సాతవాహన రాజులు మిగిలిన ప్రాంతములనే పరిపాలించుకుంటూ వచ్చారు. క్రీ. శ. 2వ శతాబ్ది కడపటి పాదంలో యజ్ఞశ్రీ అనే రాజు సాతవాహన రాజ్యానికి అధిపతి అయినాడు. ఇతడు గొప్ప యోధుడు. ఈ మహారాజు అనేక దండయాత్రలు సాగించి తన పూర్వులు కోల్పోయిన ప్రాంతములను జయించి, తిరిగి దక్షిణాపథం అంతటినీ పరిపాలించాడు. మరి కొద్ది కాలానికే క్రీ. శ. 210లో సాతవాహన వంశమూ, సాతవాహన సామ్రాజ్యమూకూడా అంతరించి పోయినవి.

సాతవాహన సామ్రాజ్యం వర్ధిల్లిన నాలుగున్నరశతాబ్దుల కాలమూ దక్షిణాపథ చరిత్రలోనూ, ఆంధ్రదేశ చరిత్రలోనూ కూడా చాల ముఖ్యమైనది. ఏదో కొంతకాలం యవన, శక,

పహ్లావుల మూలంగా కొంత అలజడి జరిగినా, మొత్తంమీద ఈ కాలంలో శాంతి సౌఖ్యములు సుస్థిరంగా ఉండినవి. ప్రజలు తృప్తితో జీవించారు. ఆనాటి కుటుంబములు అవిభక్తములుగా ఉండి, వాటిలో అన్యోన్యం ఎక్కువగా ఉండేది. తీర్థయాత్రలు చేసినా, దాన ధర్మములు చేసినా కుటుంబంలోని స్త్రీ పురుషులు అందరూ కలిసి సమష్టిగా చేసేవారు. కుటుంబ యజమాని "గృహపతి" అనే పేర చాలా గౌరవంగా చూడబడేవాడు. స్త్రీలకు కుటుంబములలో ఎంతో గౌరవమూ, ప్రాముఖ్యమూ ఉండేవి. ఆర్థికంగా కొంత స్వాతంత్ర్యం ఉండి వారు స్వంతంగా అనేక దాన ధర్మములు చేసేవారు. ఇళ్లు చాలాశుభ్రంగానూ, అందంగానూ ఉండేవి.గోడలమీద రామాయణమూ, భారతమూ, భాగవతమూవంటి గ్రంథములలో వర్ణించబడిన ఘట్టములు రంగులతో చిత్రించబడేవి. వర్ణాశ్రమ వ్యవస్థ అమలులో ఉండి ప్రజలందరూ దానికి కట్టుబడి ఉండేవారు.

నేటివలెనే నాడున్నూ వ్యవసాయం ప్రజల ముఖ్య వృత్తిగా ఉండేది. ప్రభుత్వం కర్షకులకు అనేక సౌకర్యములను కలిపించి అనేకవిధముల వారికి సహాయం చేసేది. దేశంలో అనేక పరిశ్రమలు సాగేవి. ఆ యా పరిశ్రమలలో పనిచేసే కార్మికులు సంఘములుగా ఏర్పడి, తమ తమ వృత్తులను సాగించుకొనేవారు. ఇక్కడ తయారు అయే వస్తువులు ఆ రోజులలో విదేశాలకు ఎగుమతి అయేవి. దేశంలోపలా, విదేశములతోనూ కూడా వర్తకం విరివిగా సాగేది. వర్తకులుకూడా అనేక

సంఘములుగా ఏర్పడి వాణిజ్యం సాగించేవారు. దక్షిణాపథంలో తూర్పు తీరంలోనూ, పడమటి తీరంలోనూకూడా ఎన్నో రేవులు ఉండేవి. చిన్న చిన్న ఓడలు ఒక రేవునించి ఇంకొక రేవుకు సరకులను సరఫరా చేసేవి. పెద్ద పెద్ద ఓడలు మనదేశంనించి దూర దేశాలకు సరకులను తీసుకు పోయేవి.

ఈ కాలంలో వైదికమతమూ, బౌద్ధమతమూ వర్ధిల్లినవి. వీటిలో ఏ విధమైన వైషమ్యమూ ఉండేదికాదు. సాతవాహన చక్రవర్తి అయిన మొదటి సాతకర్ణి మహారాజు అశ్వమేథ రాజసూయములనే కాక అనేక వైదిక క్రతువులను చేసి, అపారమైన ధనాన్ని, కనకవస్తువాహనములనూ దానం చేశాడు. గౌతమీపుత్ర సాతకర్ణి వర్ణాశ్రమ ధర్మమును రక్షించి, వైదిక ధర్మమును ఉద్ధరించాడు. జనసామాన్యం శివుడినీ, విష్ణువునూ ఆరాధించేవారు. ఈ దైవములకు సంబంధించిన గాథలు విరివిగా ప్రచారంలో ఉండేవి. ఈ దైవములకొరకు దేవాలయములు కట్టబడేవి. వైదికమతంకంటే బౌద్ధమతం ఎక్కువ ఆదరాన్ని పొందింది. సాతవాహన రాజులు తాము వైదిక ధర్మానుయాయులే అయినా, బౌద్ధులనుకూడా ఆదరించారు. దక్షిణాపథం అంతటా, ఆంధ్రదేశంలో అనేకచోట్లా బౌద్ధ తీర్థములు ఉండేవి. ఆంధ్రదేశంలో శాలిహుండం, రామతీర్థం, శంకరం, గుంటుపల్లి అనేచోట్ల ఈ తీర్థములు కొండలమీద నిర్మించబడి ఉండేవి. ఇవి కాక అదుర్రు, కొడవలి, అరుగొలను, గుమ్మడిదుర్రు, ఘంటశాల, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, అమరావతి,

నాగార్జునకొండ, చినగంజాం మొదలైనచోట్ల సమతలముల లోనూ, నదీతీరములలోనూ ఈ తీర్థములు వర్ధిల్లినవి. రాజులూ, ధనికులైన ప్రజలూ ఈ తీర్థములను పోషించేవారు. ఈ బౌద్ధ మతంలో హీనయానమూ, మహాయానమూ అని రెండు ప్రధాన శాఖలు ఉండేవి. మహాయాన బౌద్ధులు ఆలయముల లోనూ, శిల్పంలోనూ బుద్ధుని ప్రతిమను నెలకొల్పి దానిని ఆరాధించేవారు. వేలమంది బౌద్ధ భిక్షువులూ, భిక్షుకులూ దేశంలో మత ప్రచారం చేసేవారు. బుద్ధుడి తరువాత మళ్ళీ అంతటి వాడని ప్రసిద్ధి చెందిన ఆచార్య నాగార్జునుడు నాగార్జున కొండలో నివసించి ఈ కాలంలో మన దేశంలోనూ, ఇతర దేశములలోనూకూడా మహాయాన బౌద్ధమతమును ప్రచారం చేయించాడు.

ఈ కాలంలో ప్రాకృతం ప్రధాన భాషగా ఉండేది. రాజులు తమ శాసనములను ఆ భాషలోనే వ్రాయించేవారు. ప్రజలు దాన ధర్మములను చేసినప్పుడు వాటికి సంబంధించిన శాసనములను ఆ భాషలోనే వేయించేవారు. బౌద్ధ భిక్షువులు తమ మత గ్రంథములను ప్రాకృతంలోనే వ్రాసేవారు. కవులూ, పండితులూ ఆ భాషలో అనేక గ్రంథములను రచించారు. సాతవాహన రాజులలో ఒకడు అయిన కుంతల సాతకర్ణి ఆస్థానంలో గుణాఢ్యుడనే పండితుడు మంత్రిగా ఉండేవాడు. అతడు పైశాచీ ప్రాకృతంలో "బృహత్కథ" అనే గ్రంథమును రచించాడు. మరి ఒక సాతవాహన రాజు అయిన హాలుడు

తనూ, తాను ఆదరించిన కవులూ, పూర్వ కవులూ రచించిన గాథలలో 700 గాథలను ఏరి "సప్తశతి" అనే గ్రంథమును సంకలనం చేశాడు. ఈ కాలంలో సంస్కృత భాషకూడా వ్యాప్తిలో ఉండేది. మహాయాన బౌద్ధం ప్రబలడంతో బౌద్ధ గ్రంథములు చాలాభాగం సంస్కృతంలో వ్రాయబడుతూ వచ్చినవి.

సాతవాహన యుగంలో వాస్తు శిల్పకళలు అనేక విధముల అభివృద్ధి చెందినవి. బౌద్ధమతం వీటికి చక్కని దోహదం కలిపించింది. దేశం అంతటా అనేక బౌద్ధ తీర్థములు ఉండేవి. ప్రతి తీర్థంలోనూ అనేక కట్టడములు ఉండి వాటిలో వందలమంది భిక్షువులూ, భిక్షుకులూ నివసించేవారు. ప్రతి తీర్థంలోనూ ఒక స్తూపం ఉండేది. ఈ స్తూపములలో కొన్ని బుద్ధునియొక్కా, గొప్ప ఆచార్యులయొక్కా అవశేషముల మీద కట్టబడినవి. తక్కినవి వారి జ్ఞాపకార్థం కట్టబడినవి. ఇవి కాక ఆనాడు ఈ తీర్థములను చూడడానికి వచ్చిన యాత్రికులు కట్టించినవి చిన్న చిన్న స్తూపములు ఉండేవి. ప్రతి స్తూపంలోనూ క్రింద వలయాకారంగా ఎత్తైన వేదిక ఉంటుంది. దానిమీద గోలుగా ఉండే భాగం ఉంటుంది. ఈ భాగం మధ్యని హార్మిక అనే పెట్టెవంటి భాగం ఉంటుంది. ఈ హార్మిక మధ్యనించి ఒక కామ, దాని చివర ఒక గొడుగూ ఉంటాయి. కొన్ని స్తూపములను ఇటుకతో కట్టి వెలుపలివైపున సున్నం గిలాబా చేసేవారు. అమరావతీ, నాగార్జునకొండవంటి చోట్ల ఈ

స్తూపములకు వెలుపలివైపు చక్కని శిల్పములు గల చలవరాతి పలకలను మలిచేవారు. ఈ శిల్పములలో బుద్ధుడి జీవితంలోని



అమరావతిలోని బౌద్ధ స్తూపము

వివిధ ఘట్టములూ, అతని పూర్వ జన్మలలో జరిగిన సంఘటనలను వర్ణించే జాతకకథలూ మనోహరంగా చెక్కేవారు. తీర్థములో ఉండేవారూ, బైటనించి వచ్చిన యాత్రికులూ ఈ స్తూపములను ఆరాధించేవారు. ఈ స్తూపముల చుట్టూ విహారములు ఉండేవి. ప్రతి విహారంలోనూ మధ్య స్తంభములు గల విశాలమైన హాలు ఉండేది. ఈ హాలుకు మూడువైపులా చిన్న చిన్న గదులు ఉండేవి. ఈ గదులలో భిక్షువులూ, భిక్షుకులూ నివసించేవారు.

విహారములలోనూ, వెలుపలాకూడా చైత్యగృహాలు ఉండేవి. వీటిలో ముందు ద్వారం దాటగానే ఒక హాలూ, దాని వెనుక గుర్రపులాడం ఆకారంలో గల భాగం ఉండేవి. కొన్నిటిలో ఈ భాగం లోపలివైపు గోడవెంబడి అరుగువలె ఉండి ప్రదక్షిణం చెయ్యడానికి ఉపయోగించేది. లోభాగాన మధ్యలో ఒక చిన్న స్తూపంకాని, ఒక వేదిక మీద బుద్ధుని విగ్రహంకాని ఉండేది. ఈ చైత్యగృహాలపైన కప్పుకూడా గుర్రపు లాడం ఆకారం లోనే ఉండేది. ఇవిగాక ఈ విహారములలో విశాలములైన సమావేశ భవనములూ, ప్రార్థనామందిరములూ ఉండేవి. ఈ తీర్థములలో కొన్ని కొండలమీద ఉండేవి. ఆంధ్రదేశంలో శాలిహుండం, రామతీర్థం, శంకరం, దోమకొండ, గుంటుపల్లి శైల తీర్థములు. తక్కిన తీర్థములు సమతలంలో నిర్మించబడినవి. ఆదుర్రు, కొడవలి, ఆరుగొలను, అల్లూరు, గరికపాడు, జగ్గయ్యపేట, ఘంటశాల, బెజవాడ, గుడివాడ, భట్టిప్రోలు, అమరావతి, నాగార్జునకొండ, కనపర్తి, చినగంజాం, ఫణిగిరి, నాగులబండ, కొండాపురం మొదలయినచోట్ల ఇలాంటితీర్థములు ఉండేవి. ఈ బౌద్ధ యుగంలో శిల్పం అద్భుతంగా అభివృద్ధి చెందింది. మధ్యభారతంలో సాంచీ అనేచోట అశోకచక్రవర్తి ఒక స్తూపం నిర్మించాడు. ఆ స్తూపం చుట్టూ గల ప్రాకారంలో నాలుగుదిక్కులా నాలుగు చక్కని ద్వారములు సాతవాహన

రాజు అయిన రెండవ సాతకర్ణి కాలంలో ఎత్తబడినవి. ఈ ద్వారములమీద లోకోత్తరములైన శిల్పములు ఉన్నవి. గుంటూరుజిల్లాలోని అమరావతిలో బుద్ధుని అవశేషంమీద నిర్మించబడిన మహాచైత్యం ఉండేది. దానికి క్రీ. పూ. 3 వ



సాంచీ తోరణము

శతాబ్దినించి క్రీ. శ. 3వ శతాబ్దివరకూగల కాలంలో తరతరముల ఆంధ్ర శిల్పులు చలవరాతి పలకలమీద మనోహరములైన శిల్పములను చెక్కి వాటిని మలిచారు. ఈ సాంచీ, అమరావతీ

శిల్పములవంటి సుందర శిల్పములు అరుదుగాకాని లభించవు. ఇవి కాక ఈ కాలంలో చిత్రలేఖనంకూడా బాగా అభివృద్ధి చెందింది. అజాంతాలో ఉన్న గుహలలో ఐదు సాతవాహన యుగం నాటివి. వీనిలో చక్కని చిత్రములు ఉన్నవి. ఈ చిత్రములు అన్నివిధములా అమరావతీ శిల్పములను పోలి ఉన్నవి. ఈవిధంగా జగత్ప్రసిద్ధమైన అజంతా చిత్రలేఖన కళకుకూడా సాతవాహనయుగంలోనే పునాదులు వేయ బడినవి.



## ఉత్తర సాతవాహన యుగం :

సాతవాహన సామ్రాజ్యం క్రీ. శ. 210 ప్రాంతంలో పడిపోయింది. ఆ తరువాత దక్షిణాపథం భిన్నభిన్నం అయిపోయింది. పడమటి భాగంలో ఆభీరులు మొదలయిన తెగలవారు ప్రబలారు. మధ్యభాగమును వాకాటకులనే రాజవంశంవారు వశపరచుకున్నారు. తూర్పు భాగాన అనగా, కోస్తా ప్రాంతంలో క్రీ. శ, 625 వరకూ అనేక రాజవంశములు పరిపాలన చేసినవి. నేటి తెలింగానా ప్రాంతం వాకాటకరాజ్యంలో చేరిపోయింది.

సాతవాహన వంశం అంతరించిన వెంటనే ఇక్ష్వాకులు విజృంభించారు. వీరు ఆంధ్రులు. పురాణములలో ఈ రాజవంశీకులు శ్రీపర్వతీయాంధ్రులని వర్ణింపబడినారు. నేటి నాగార్జునకొండలోయలో గల విజయపురి అనే నగరం రాజధానిగా ఇక్ష్వాకులు సాతవాహనులకు సామంతులుగా ఉండి ప్రాక్తీర్ధాన్ని పరిపాలించేవారు. ఈ వంశీయుడైన చాంతమూలుడు స్వతంత్రుడై, చుట్టుపట్లగల హిరణ్యకులు, పూగీయులు, ధనకులు మొదలయిన తెగలవారిని వశపరచుకొని, దక్షిణాపథంలోని తూర్పుభాగాన్ని జయించి, ఒక సామ్రాజ్యం స్థాపించాడు. ఇతడు అశ్వమేధాగ్నిష్టోమ వాజపేయాది యాగములను చేసి చక్రవర్తిగా పరిపాలించాడు. ఈ మహారాజు అంతవరకూ

బౌద్ధమతంయొక్క విజృంభణ మూలంగా వెనకపడి ఉండిన వైదికమతాన్ని పునరుద్ధరించి ప్రచారం చేశాడు. తరువాత ఇతని కుమారుడు శ్రీవీరపురుషదత్తుడు రాజ్యానికి వచ్చాడు. ఈ కాలంలో ఇక్ష్వాకు సామ్రాజ్యం బాగా విస్తరించి ఉండేది. ఇక్ష్వాకులు అటు ఉజ్జయినీ పాలకులైన శకులతోటీ, ఇటు వైజయంతీపాలకులైన చుటు వంశీయులతోటీ వైవాహిక సంబంధములను ఏర్పరచుకున్నారు. విజయపురిలో బుద్ధుని అవశేషంమీద నిర్మించబడిన ఒక మహాచైత్యం ఉండేది. దాని చుట్టూ ఒక బౌద్ధ తీర్థం ఉండేది. శ్రీవీరపురుషదత్తుని కాలంలో ఇక్ష్వాకు రాజవంశపు స్త్రీలు బౌద్ధమతమునూ, బౌద్ధులనూ అనేక విధముల ఆదరించారు. మహాచైత్యం చుట్టూ చలువరాతి పలకలను మలిపించారు. ఈ కాలంలో చక్కని శిల్పములు గల పలకలను మలిచి మరికొన్ని స్తూపములు నిర్మించబడినవి. ఈతీర్థంలో అనేక స్తూపములూ, చైత్య గృహములూ, విహారములూ నిర్మించబడినవి. ఇక్కడికి చైనా, సింహళమూ, కాంభోజమూవంటి దూరదేశముల నుంచి అనేకమంది బౌద్ధ యాత్రికులు వస్తూండేవారు. ఇక్ష్వాకు వంశంలో కడపటి రాజైన రెండవపురుషదత్తుడి కాలంలో సింహవర్మ అనే పల్లవరాజు దండెత్తి వచ్చి, కృష్ణాదక్షిణభాగాన గల ఇక్ష్వాకు రాజ్యాన్ని తనరాజ్యంలో కలుపుకున్నాడు. ఇంతటితో క్రీ. శ. 270 ప్రాంతాన ఇక్ష్వాకుల పరిపాలనం అంతరించింది.

ఇక్ష్వాకు సామ్రాజ్యం పడిపోయిన తరువాత ప్రాగాంధ్రదేశం మూడు రాజ్యములుగా విడిపోయింది. గోదావరికి

ఉత్తరంగా ఉన్న భాగం కళింగం. అది ఒక స్వతంత్రరాజ్యం అయింది. కృష్ణాగోదావరీ నదుల మధ్య గల భాగం మరి ఒక స్వతంత్ర రాజ్యంగా ఏర్పడింది. దీనికి వేంగిరాజ్యం అని పేరు వచ్చింది. కృష్ణానదికి దక్షిణంగాఉన్న భాగమూ, నేటి రాయలసీమ ప్రాంతమూ మరి ఒక స్వతంత్ర రాజ్యం అయింది. దీనికి ఆంధ్రపథం అని పేరు వచ్చింది.

ఇక్ష్వాకుల అనంతరం పల్లవులు ఆంధ్రపథానికి ఏలికలు అయ్యారు. ఈ పల్లవులు సాతవాహన సామ్రాజ్యపు దక్షిణ సీమలో ఉంటూండేవారు. వారి నాయకుడైన సింహావర్మ స్వతంత్రుడై, నేటి రాయలసీమ భాగాన్ని ఆక్రమించాడు. పిమ్మట ఆతడు వైజయంతీరాజు కూతురును పెండ్లిచేసుకొని. ఆ రాజ్యానికి రాజు అయినాడు. ఆ మీద అతడు ఇక్ష్వాకు రాజ్యంలోని దక్షిణాభాగాన్ని, నేటి అరవదేశంలోని తొండ మండలాన్ని జయించి, ఈ విశాలరాజ్యాన్ని కాంచీనగరం నుంచి పరిపాలించాడు. ఈ పల్లవులలో ఒక శాఖవారు దక్షిణాంధ్రదేశాన్ని పరిపాలించారు. వీరందరూ వైదిక ధర్మాన్ని ఆదరించారు, అనేకమంది పండితులను పోషించి వేదవిద్యలన్నీ ప్రోత్సహించారు. వీరి ఆదరణవల్ల వైదికమతం ప్రబలింది.

ఈ కాలంలో మొదట సాలంకాయన గోత్రులైన రాజవంశంవారు ఒకటిన్నర శతాబ్దుల కాలం వేంగీ రాజ్యాన్ని పరిపాలించారు. వీరున్నూ వైదిక మతాన్ని అవలంబించి, వేదపండితులను ఆదరించారు.

బౌద్ధమతంయొక్క విజృంభణ మూలంగా వెనకపడి ఉండిన వైదికమతాన్ని పునరుద్ధరించి ప్రచారం చేశాడు. తరువాత ఇతని కుమారుడు శ్రీవీరపురుషదత్తుడు రాజ్యానికి వచ్చాడు. ఈ కాలంలో ఇక్ష్వాకు సామ్రాజ్యం బాగా విస్తరించి ఉండేది. ఇక్ష్వాకులు అటు ఉజ్జయినీ పాలకులైన శకులతోటీ, ఇటు వైజయంతీపాలకులైన చుటు వంశీయులతోటీ వైవాహిక సంబంధములను ఏర్పరచుకున్నారు. విజయపురిలో బుద్ధుని అవశేషంమీద నిర్మించబడిన ఒక మహాచైత్యం ఉండేది. దాని చుట్టూ ఒక బౌద్ధ తీర్థం ఉండేది. శ్రీవీరపురుషదత్తుని కాలంలో ఇక్ష్వాకు రాజవంశపు స్త్రీలు బౌద్ధమతమునూ, బౌద్ధులనూ అనేక విధముల ఆదరించారు. మహాచైత్యం చుట్టూ చలువరాతి పలకలను మలిపించారు. ఈ కాలంలో చక్కని శిల్పములు గల పలకలను మలిచి మరికొన్ని స్తూపములు నిర్మించబడినవి. ఈతీర్థంలో అనేక స్తూపములూ, చైత్య గృహములూ, విహారములూ నిర్మించబడినవి. ఇక్కడికి చైనా, సింహళమూ, కాంభోజమూవంటి దూరదేశముల నుంచి అనేకమంది బౌద్ధ యాత్రికులు వస్తూండేవారు. ఇక్ష్వాకు వంశంలో కడపటి రాజైన రెండవపురుషదత్తుడి కాలంలో సింహవర్మ అనే పల్లవరాజు దండెత్తి వచ్చి, కృష్ణాదక్షిణభాగాన గల ఇక్ష్వాకు రాజ్యాన్ని తనరాజ్యంలో కలుపుకున్నాడు. ఇంతటితో క్రీ. శ. 270 ప్రాంతాన ఇక్ష్వాకుల పరిపాలనం అంతరించింది.

ఇక్ష్వాకు సామ్రాజ్యం పడిపోయిన తరువాత ప్రాగాంధ్రదేశం మూడు రాజ్యములుగా విడిపోయింది. గోదావరికి

ఉత్తరంగా ఉన్న భాగం కళింగం. ఆది ఒక స్వతంత్రరాజ్యం అయింది. కృష్ణాగోదావరీ నదుల మధ్య గల భాగం మరి ఒక స్వతంత్ర రాజ్యంగా ఏర్పడింది. దీనికి వేంగీరాజ్యం అని పేరు వచ్చింది. కృష్ణానదికి దక్షిణంగాఉన్న భాగమూ, నేటి రాయల సీమ ప్రాంతమూ మరి ఒక స్వతంత్ర రాజ్యం అయింది. దీనికి అంధ్రపథం అని పేరు వచ్చింది.

ఇక్ష్వాకుల అనంతరం పల్లవులు అంధ్రపథానికి ఏలికలు ఆయారు. ఈ పల్లవులు సాతవాహన సామ్రాజ్యపు దక్షిణ సీమలో ఉంటూండేవారు. వారి నాయకుడైన సింహవర్మ స్వతంత్రుడై, నేటి రాయలసీమ భాగాన్ని ఆక్రమించాడు. పిమ్మట ఆతడు వైజయంతీరాజు కూతురును పెండ్లిచేసుకొని. ఆ రాజ్యానికి రాజు అయినాడు. ఆ మీద అతడు ఇక్ష్వాకు రాజ్యంలోని దక్షిణాభాగాన్ని, నేటి అరవదేశంలోని తొండ మండలాన్ని జయించి, ఈ విశాలరాజ్యాన్ని కాంచీనగరం నుంచి పరిపాలించాడు. ఈ పల్లవులలో ఒక శాఖవారు దక్షిణాంధ్రదేశాన్ని పరిపాలించారు. వీరందరూ వైదిక ధర్మాన్ని ఆదరించారు, అనేకమంది పండితులను పోషించి వేదవిద్యలన్నీ ప్రోత్సహించారు. వీరి ఆదరణవల్ల వైదికమతం ప్రబలింది.

ఈ కాలంలో మొదట సాలంకాయన గోత్రులైన రాజవంశంవారు ఒకటిన్నర శతాబ్దుల కాలం వేంగీ రాజ్యాన్ని పరిపాలించారు. వీరున్నూ వైదిక మతాన్ని అవలంబించి, వేదపండితులను ఆదరించారు.

అనంతరం విష్ణుకుండిన వంశీకులు వేంగీ దేశాన్ని పరిపాలించారు. వీరు వినుకొండ ప్రాంతంనించి వలసవచ్చి వేంగిని జయించి వశపరచుకున్నారు. వీరుకూడా వైదిక ధర్మాన్ని బాగా ఆదరించారు. ఈ వంశీయులలో మాధవవర్మ అనే మహారాజు అశ్వమేధాది క్రతువులను ఎన్నిటినో చేసి చక్రవర్తి అయి పరిపాలించాడు. ఈ కాలంలో తూర్పుకనుమలకు అవతల వాకాటకులు ప్రబలంగా ఉండేవారు. వీరు విష్ణుకుండినులతో వైవాహిక సంబంధం ఏర్పరచుకున్నారు.

కళింగ రాజ్యాన్ని ఈ కాలంలో అనేకమంది రాజ వంశములవారు పరిపాలించారు. వీరందరూకూడా వైదిక ధర్మమును అనేకవిధముల ఆదరించి, వేదవిద్యలను పోషించారు.

ఈ ఉత్తర సాతవాహనయుగంలో వైదికమతం బాగా వర్ధిల్లింది. ఇక్ష్వాకులు రాజ్యం చేసిన కొద్దికాలంలోనూ బౌద్ధ మతానికి కొంత ఆదరణ లభించింది. ఆ తర్వాత వచ్చిన రాజులు ఎవరూ ఆ మతమును ఆదరించలేదు. అందువల్ల ఆ మతం క్రమ క్రమముగా క్షీణించి పోయింది. క్రీ. శ. 7వ శతాబ్దినాటికి బౌద్ధ తీర్థములు చాలాభాగం నిర్జనములు అయిపోయినవి. వాటిలోని కట్టడములు శిథిలములు అయినవి. ఈ కాలంలో భాగవత సాంప్రదాయమునకు చెందిన వైష్ణవమతము, శైవ మతమూ బాగా వ్యాపించినవి.

ఈ కాలంలో విష్ణుకుండినులూ, పల్లవులూ వాస్తు శిల్పకళలను చక్కగా పోషించారు. వారి ప్రోత్సాహంతో

ఎన్నో గుహాలయములు నిర్మించబడినవి. ఇలాంటి ఆలయములు బెజవాడదగ్గర ఉన్న మొగలురాజపురం అనే గ్రామంలో కొండలలో దొలవబడినవి. ఈ గుహాలలో కొన్నిటిలో త్రిమూర్తులకొరకు ఉద్దేశింపబడిన మూడేసి ఆలయములు ఉన్నవి. కొన్నిటిలో ఒక్క శివాలయము మాత్రమే ఉన్నది. బెజవాడలో ఇంద్రకీల పర్వతంమీద ఐదుగుహాలు ఉన్నవి. అందులో ఒకటి ఉమామహేశ్వరాలయము. మరి ఒకటి త్రిమూర్తుల ఆలయము. కృష్ణానది దక్షిణపు ఒడ్డున ఉండవిల్లి



ఉండవిల్లి గుహాలయం

అనే గ్రామంలో నాలుగు అంతస్తులు గల పెద్ద గుహాలయం ఉన్నది. దీనిలో అనంతశాయి ఆలయమూ, ఒకశివాలయమూ, అనేకములైన చిన్న చిన్న ఆలయములూ ఉన్నవి. నెల్లూరు జిల్లాలో భైరవకొండ అనేచోట చాలా గుహాలయములు ఉన్నవి. ఇవి చాలవరకూ శివాలయములే. ఈ ఆలయము లన్నిటిలోనూ శిల్పములు ఉన్నవి. భైరవకొండలోని శివ, విష్ణు, గణపతుల శిల్పములూ, మొగలురాజపురం లోని నట రాజ శిల్పమూ మనోహరములుగా ఉన్నవి.

# వేంగి చాళుక్య యుగం :

ఆంధ్రదేశ చరిత్రలో క్రీ.శ. 625-1076 మధ్యగల నాలుగు న్నర శతాబ్దుల కాలం వేంగీ చాళుక్య యుగం అని ప్రసిద్ధి చెందినది. ఈ కాలంలో చాళుక్య రాజ వంశీయులలో ఒక శాఖవారు మొదట వేంగీ నగరమూ, తరువాత రాజ మహేంద్రవరమూ రాజధానులుగా కోస్తాప్రాంతమును పరిపాలించారు.

క్రీ. శ. 6వ శతాబ్ది మధ్య భాగాన చాళుక్యులనే ఒక వంశీకులు కర్ణాటకంలో బాదామీనగరం రాజధానిగా ఒక రాజ్యమును స్థాపించి, పరిపాలించారు. ఈ వంశీకులలో రెండవ పులకేశి అనే రాజు మహా పరాక్రమశాలి. అనేక ప్రాంతములను జయించి ఇతడు చాళుక్య రాజ్యమును ఒక సామ్రాజ్యంగా మార్చాడు. ఈ మహారాజు తన తమ్ముడయిన విష్ణువర్ధనునితో కలసి దక్షిణాపథం తూర్పుతీరం మీద దండెత్తి వచ్చి, నేటి శ్రీకాకుళం, విశాఖపట్టణం, ఉభయగోదావరీ, కృష్ణా, గుంటూరు జిల్లాలను జయించాడు. అనంతరం విష్ణువర్ధనుడు ఈ ప్రాంతమును ఒక రాజ్యంగా ఏర్పరచి, అన్న అనుమతితో క్రీ.శ. 625 నుంచీ దీనిని స్వతంత్రుడుగా పరిపాలించాడు. ఈ విష్ణువర్ధనునికీ, ఇతని సంతతి వారికీ తూర్పు చాళుక్యులనీ, వేంగీ చాళుక్యులనీ పేరు వచ్చింది.

ఈ వేంగీ చాళుక్యులు రాజ్యం చేసిన కాలంలో దక్షిణాన పల్లవులు, నేటి మైసూరు ప్రాంతంలో పశ్చిమ గాంగులు, పడమట క్రీ. శ. 753 నుంచి క్రీ. శ. 973 వరకూ రాష్ట్రకూటులూ, ఉత్తరాన తూర్పుగాంగులూ, రాజ్యం చేస్తూ వచ్చారు. వేంగీ చాళుక్యులకు ఈ రాజవంశముల వారితో ఎన్నో యుద్ధములు సంభవించినవి. వేంగీ చాళుక్య రాజులలో మొదటి వాడయిన విష్ణువర్ధనుని కాలంలో అతనిరాజ్యం విశాఖపట్టణం, ఉభయగోదావరీ, కృష్ణా, గుంటూరు జిల్లాలలో వ్యాపించి ఉండేది. అతని అనంతరం ఏభై సంవత్సరముల కాలంలో ఈ రాజ్యం దక్షిణాన నెల్లూరు జిల్లాలోకి వ్యాపించింది. ఇంతవరకూ ఈ వంశపు రాజులకు ఏ విధమయిన ఆటంకమూ ఏర్పడలేదు.

క్రీ. శ. 8వ శతాబ్ది మధ్య భాగంలో రాష్ట్రకూట వంశం అని ఒక వంశం ఉండేది. ఆ వంశీకులు రెండవ పులకేశి మహారాజు సంతతివారైన బాదామీ చాళుక్యులకు సామంతులుగా ఉండే వారు. ఈ రాష్ట్రకూట వంశీకుడైన దంతిదుర్గుడు, బాదామీ చాళుక్యుల మీద తిరుగుబాటు చేసి, స్వతంత్రుడై ఒక రాజ్యాన్ని నిర్మించుకున్నాడు. ఆ రోజులలో బాదామీ చాళుక్యరాజ్యం తూర్పుకనుమల వరకూ, అనగా వేంగీ చాళుక్య రాజ్యపు పడమటి సరిహద్దు వరకూ వ్యాపించి ఉండేది. ఆ చాళుక్యులూ, ఈ చాళుక్యులూ దాయాదులే కావడం వల్ల వారికీ వీరికీ ఏ విధమైన వైషమ్యమూ లేకపోయింది. కాని రాష్ట్రకూటులు బాదామీ చాళుక్య రాజ్యమును వశపరచుకొని

దానికి వలికలు కావడంతో వేంగిచాళుక్యులకు గొప్ప ప్రమాదం ఏర్పడింది. ఈ రాష్ట్రకూటులు 220 సంవత్సరములు పరిపాలన చేశారు. ఈ కాలంలో వీరు వేంగీ చాళుక్య రాజ్యమును జయించి వశపరచుకోడానికి అనేక ప్రయత్నములు చేశారు. దీనికి తోడు వేంగీ చాళుక్య రాజవంశంలో రాజ్యాధికారం కొరకు అనేక తగవులు బయలుదేరినవి. ఎప్పటికప్పుడు అన్న తమ్ములో, దాయాదులో ఒకరితో ఒకరు యుద్ధములు చేసు కోవడమూ, వీరిలో ఎవరో ఒకరు పక్కన ఉండిన రాష్ట్రకూటుల సహాయం కోరడమూ జరుగుతూ వచ్చినవి. ఇలాటి అవకాశం దొరికినప్పుడల్లా రాష్ట్రకూటులు వేంగీ రాజ్యం మీద దండెత్తి రావడమూ, వీలయినంతకాలం ఇక్కడ మకాం చేసి, దేశాన్ని అలజడి పరచడమూ జరుగుతూ వచ్చినవి. ఈ కాలంలో ఎందరో శూరులైన వేంగీ చాళుక్య రాజులు గొప్ప గొప్ప యుద్ధములు చేసి తమ రాజ్యాన్ని రక్షించారు. అయినా ఈ కాలంలో పదే పదే వచ్చి పడిన ప్రబల ప్రమాదములను తట్టుకొని వేంగీరాజ్యం నిలవగలగడం చాలా ఆశ్చర్యకరమైన విషయము.

రాష్ట్రకూటులవల్ల ఉపద్రవములు సంభవించిన కాలంలో రాజ్యం చేసిన గొప్ప రాజులలో నరేంద్ర మృగరాజ విజయా దిత్యుడనే మహారాజు మొదటివాడు. ఇతడు దక్షిణాన పల్ల వులతో యుద్ధం చేసి వేంగీ రాజ్యాన్ని పులికాట్ సరస్సు వరకూ విస్తరించాడు. ఆ మీద రాష్ట్రకూటులు ఇతని రాజ్యం మీద దండెత్తి వచ్చారు. వారు రాజ్యంలో చాలా భాగం ఆక్ర

మించారు. కాని విజయాదిత్య మహారాజు ధైర్యం కోలుపోకుండా ఈ శత్రువులతో పన్నెండు సంవత్సరముల కాలం పోరాడాడు. నూట ఎనిమిది యుద్ధములు చేసి తుదకు ఇతడు శత్రువులను తన రాజ్యంలోనుంచి పారద్రోలాడు. ఈ యుద్ధములలో అనేక మందిని చంపిన పాపం పోవడానికిగాను ఈ మహారాజు నూట ఎనిమిది శివాలయములను కట్టించి, వాటిలో నరేంద్రేశ్వర అనే పేరుగల శివలింగములను ప్రతిష్ఠ చేశాడు.

తరవాత వచ్చిన వేంగీ చాళుక్యరాజులలో గుణగ విజయాదిత్యుడు గొప్పవాడు. ఇతనికాలంలో దక్షిణాన నెల్లూరు జిల్లా దాటి పులికాట్ సరస్సు వరకూ వేంగీ రాజ్యం విస్తరించింది. ఈ సందర్భంలో పల్లవులతో యుద్ధం చేసి, ఈ మహారాజు అపారమైన ధనమును సంపాదించాడు. తరువాత రాష్ట్రకూటులు దండెత్తి వచ్చారు. ఈ మహారాజు కంభం, వింగవల్లి అనే చోట్ల ఈ శత్రువులతో యుద్ధములు చేశాడు. అంతటితో ఆగక విజయాదిత్యుడు అనేక దిగ్విజయములు చేశాడు. దక్షిణ పశ్చిమంగా దండెత్తిపోయి ఇతడు నేటి మైసూరు రాష్ట్రంలో రాష్ట్రకూట సామంతులుగా పరిపాలన చేస్తూ ఉండిన పశ్చిమగాంగులనూ,నోలంబులనూ ఓడించాడు. తరువాత కళింగదేశం మీద దండెత్తి, ఆ దేశం మీదుగా చక్రకూట, దాహాల, చేదిమండలముల గుండా పోయి, రాష్ట్రకూట రాజును ఓడించి అతని వంశపు చిహ్నము అయిన పాలిధ్వజమును లాగుకొని తన రాజధానికి మరలివచ్చాడు. ఈ మహారాజు తన పేర

కట్టబడిన బిక్కవోలు నగరంలో ఆరు శివాలయములను నిర్మించాడు.

గుణగ విజయాదిత్యుడు మరణించిన తరవాత రాష్ట్రకూటులు మళ్ళీ విజృంభించారు. వేంగి మీద దండెత్తి వచ్చి వారు ఈ రాజ్యాన్ని కొన్ని సంవత్సరముల కాలం ఆక్రమించారు. దేశంలో అరాజకం ప్రబలింది. తుదకు చాళుక్య భీమ మహారాజు ఈ శత్రువులను దేశం నుంచి తరిమివేసి, వారితో కుట్రలు చేసిన దాయాదులను అణచివేసి దేశంలో శాంతిని నెలకొలిపాడు. ఈ మహారాజుకూడా తన విజయములకు సూచకములుగా తన పేర అనేక శివాలయములను కట్టించాడు.

మరికొంతకాలానికి చాళుక్య రాజవంశంలో తగవులు బయలుదేరినవి. అమ్మరాజూ, దానార్ణవుడూ అనే సవతి అన్నతమ్ములు పోట్లాడుకున్నారు. ఇద్దరూకూడా కొంతకాలం రాజ్యం చేశారు. దానార్ణవుని అనంతరం అతని వారసులైన ఇద్దరు కొడుకులనూ త్రోసిపుచ్చి, దాయాదులు రాజ్యం ఆక్రమించారు. వీరి పరిపాలన ఇరవైఏడు సంవత్సరములకాలం సాగింది.

ఈ కాలానికి దక్షిణాన పల్లవుల పరిపాలన అంతం అయి చోళులు అధికారంలోకి వచ్చారు. పడమట రాష్ట్రకూటుల పరిపాలనముకూడా అంతరించి పోయింది. వారిస్థానే కల్యాణీ చాళుక్యులనే మరి ఒక రాజవంశంవారు రాజులు అయ్యారు.

ఇటు చోళులు ఉత్తరంగానో, అటు కల్యాణీ చాళుక్యులు దక్షిణంగానూ నేటి మైసూరు రాష్ట్రంలోకి తమతమ రాజ్యాములను విస్తరించసాగారు. అందువల్ల వారి ఉభయులకూ వైరం ఏర్పడి, అనేక యుద్ధములు జరుగుతూ వచ్చినవి. వేంగీచాళుక్య రాజయిన దానార్ణవుని కుమారులైన శక్తివర్మా, విమలాదిత్యుడూ దాయాదులచేత స్వదేశంనించి తరిమివేయబడి, చోళరాజ్యానికి పోయి, అక్కడ తల దాచుకున్నారు. అప్పటి చోళ రాజయిన రాజరాజ చోళుడు వీరిని ఆదరించాడు. తూర్పు తీరం వెంబడి ఉన్న వేంగీ రాజ్యం తనకు లోబడి వుంటే, ఎప్పటికి అయినా దానిని కేంద్రంగా చేసుకొని కల్యాణీ చాళుక్యులమీద దెబ్బ తీయడానికి వీలుగా ఉంటుందనే ఉద్దేశంతో ఈ చోళరాజు వేంగీ రాజపుత్రులను విశేషంగా గౌరవించి, వారిద్దరిలోనూ చిన్నవాడయిన విమలాదిత్యుడికి తన కుమార్తెను ఇచ్చి వివాహం చేశాడు. కొంతకాలం జరిగిన తరవాత సరి అయిన అదను చూచుకొని రాజరాజ చోళుడు వేంగీ రాజపుత్రులను ఇద్దరినీ వెంటబెట్టుకొని, వేంగీమీద దండెత్తి వచ్చి, అక్కడి శత్రువులనందరినీ తరిమివేసి సోదరు లిద్దరిలోనూ పెద్దవాడయిన శక్తివర్మకు రాజ్యాభిషేకం చేశాడు. ఈ శక్తివర్మ రాజ్యకాలంలో కల్యాణీ చాళుక్యులు రెండుసార్లు వేంగీమీద దండెత్తి వచ్చారు. కాని అందువల్ల ప్రమాదం ఏమీ జరగలేదు. అయినా కల్యాణీ చాళుక్యులు వేంగీమీద ఒక కన్ను వేసే ఉంచారు. ఆ రాజ్యంలో ఏర్పడిన చోళుల బలాన్ని నిర్మూలించి, తామే

అక్కడ పలుకుబడి సంపాదించి, అక్కడనించికూడా చోళ రాజ్యంమీద దండెత్తవలెనని వారి ఉద్దేశము. శక్తివర్మ తరువాత అతని తమ్ముడు విమలాదిత్యుడు రాజ్యం చేశాడు. అతనికాలం ప్రశాంతంగానే జరిగి పోయింది.

విమలాదిత్యునికి చోళరాజ పుత్రికవల్ల రాజరాజు అనే కుమారుడూ, మరి ఒక భార్యవల్ల విజయాదిత్యుడనే కుమారుడూ కలిగారు. అతని మరణానంతరం ఈ కొడుకులు ఇద్దరూ రాజ్యం కొరకు తగవులాడుకున్నారు. తుదకు రాజరాజు సింహాసనం ఎక్కాడు. విజయాదిత్యుడు కల్యాణీ చాళుక్యుల రాజ్యంలోకి పోయి, వారి ప్రాపు సంపాయించి, ఒక చిన్న మండలానికి అధిపతి అయ్యాడు. రాజరాజు తొమ్మిది సంవత్సరములు పరిపాలన చేసిన తరవాత విజయాదిత్యుడు కల్యాణీ చాళుక్యుల సహాయంతో వేంగిమీద దండెత్తివచ్చి, అన్నను తరిమివేసి, రాజ్యాన్ని ఆక్రమించి పట్టం కట్టుకున్నాడు. కాని ఇతడు చిరకాలం అధికారంలో ఉండలేకపోయాడు. రాజరాజు తరఫున చోళులూ, విజయాదిత్యుడితరఫున కల్యాణీచాళుక్యులూ వేంగీమీద దండెత్తి వచ్చారు. వీరిలో చోళులు విజయం పొంది, విజయాదిత్యుడిని తరిమివేసి రాజరాజును మళ్ళీ సింహాసనం ఎక్కించారు. ఈ రాజరాజు రాజ్యాంతకాలంలో మళ్ళీ కల్లోలములు జరిగినవి.

అనంతరం రాజరాజు కుమారుడైన రాజేంద్రుడిని త్రోసి పుచ్చి విజయాదిత్యుడు వేంగికి రాజు అయినాడు. ఇతని

కాలంలోకూడా చోళులూ, కల్యాణీ చాళుక్యులూ వేంగి రాజ్యాన్ని అలజడి పరచారు. వీర రాజేంద్రుడు దండెత్తి వచ్చి, విజయాదిత్యుని ఓడించి తరిమివేసి, రాజేంద్రునికి రాజ్యాభిషేకం చేశాడు. ఈ రాజేంద్రుడు నాలుగు సంవత్సరములు రాజ్యం చేశాడు. అప్పటికి దక్షిణాన చోళరాజ్యపు సింహాసనం ఖాళీ అయింది. అందువల్ల రాజేంద్రుడు కొంత సైన్యంతో వేంగినించి బయలుదేరి, దక్షిణాదికి పోయి, చోళ రాజ్యాన్ని ఆక్రమించి ఆ సింహాసనం అధిష్ఠించాడు. అంతటినించీ అతడు "కులోత్తుంగ" అనే బిరుదుతో చోళరాజ్యాన్ని పరిపాలిస్తూ వచ్చాడు. ఇక్కడ వేంగిలో రాజేంద్రుడు వెళ్ళగానే అతని పిన తండ్రి అయిన విజయాదిత్యుడు రాజ్యాన్ని ఆక్రమించి క్రీ. శ. 1076 వరకూ దానిని పరిపాలించాడు.

విజయాదిత్యుని మరణానంతరం రాజేంద్రుడు వేంగి రాజ్యాన్ని వశపరచుకొని తన కుమారులను ఇక్కడికి రాజప్రతినిధులుగా పంపించి వారిద్వారా ఈ రాజ్యాన్ని పరిపాలించాడు. ఈ పద్ధతి అతనికాలంలో బాగానే నడిచింది. కాని తరువాత అతని కుమారుడు రాజు అయిన తరువాత తన కుమారులను వేంగికి ప్రతినిధులుగా పంపలేక పోయాడు. అందువల్ల కోస్తాప్రాంతంలో అనేకమంది సామంతమండలీకులు తలలెత్తి విజృంభించారు. కులోత్తుంగునికీ అతని సంతతివారికీ చాళుక్యచోళులు అని పేరు. ఈ చాళుక్యచోళుల అధికారం కోస్తా ప్రాంతంమీద మరి ఒక శతాబ్ది కాలం సాగిందికాని, పిమ్మట

క్రమక్రమంగా క్షీణించింది. ఇక్కడి సామంతులు నామకః చాళుక్యచోళుల అధికారాన్ని అంగీకరించినా వాస్తవంగా స్వతంత్రులుగానే వ్యవహరిస్తూ వచ్చారు. తుదకు క్రీ. శ. 13వ శతాబ్ది ప్రారంభంలో ఓరుగల్లు రాజధానిగా పరిపాలన చేస్తూ ఉండిన కాకతీయ వంశపురాజు అయిన గణపతిదేవమహారాజు ఈ కోస్తా ప్రాంతాన్ని జయించి, ఇక్కడి మండలీకులను తనకు సామంతులుగా చేసుకున్నాడు. అంతటితో పూర్వం వేంగీ చాళుక్యరాజ్యంగా ఉండిన ప్రాంతంలో చాల భాగం కాకతీయ సామ్రాజ్యంలో చేరి పోయింది.

వేంగీ చాళుక్యుల పరిపాలన సుమారు నాలుగున్నర శతాబ్దులకాలం సాగింది. ఈకాలంలో రాజవంశంలోని అంతః కలహాములవల్లనూ, తరచుగా సాగిన రాష్ట్రకూటుల దండ యాత్రలవల్లనూ రాజకీయంగా కలవరములు జరుగుతూ వచ్చినా గుణగ విజయాదిత్యుడూ, చాళుక్యభీముడూ మొద లయిన శూరులైన రాజులు ఎప్పటికి అప్పుడు శాంతిని నెల కొలుపుతూనే వచ్చారు. అందువల్ల జనసామాన్యం యొక్క జీవితం అంతగా ఒడుదుడుకులు లేకుండానే సాగిపోయింది.

ఈ కాలంలో రాజులలో చాలామంది వైదికమతమును అనుసరించారు. వారు వైదిక విద్యలను చదువుకొని పారప్రవ చనములు చేసే విద్వాంసులను అనేకమందిని మడిమాన్యములూ, అగ్రహారములూ ఇచ్చి పోషించారు. బౌద్ధమతం క్రమ క్రమంగా క్షీణించి పోయింది. ఇటుపాలకులూ, అటు ప్రజలూ

కూడా ఆదరించక పోవడంవల్ల వందలకొలదీ ఉండిన బౌద్ధతీర్థములు నిర్జనములై, పాడుపడి పోయినవి. ఈ కాలంలో జైన మతం వ్యాప్తిలోనికి వచ్చి చాలాచోట్ల జైన వసతులు బయలు దేరినవి. ఈ జైనులు దేశభాషలో తమ మతాన్ని ప్రచారం చేసేవారు. రాజాదరణా, ప్రజాదరణా బాగా ఉండడంవల్ల వైదిక ధర్మం ఈకాలంలో బాగా అభివృద్ధి పొందింది. భాగవత సంప్రదాయమునకు చెందిన వైష్ణవమూ, కాలాముఖ పాశుపత శాఖలకు చెందిన శైవమూ దేశం అంతటా వ్యాపించినవి. దక్షారామమూ, కుమారారామమూ, క్షీరారామమూ, సోమారామమూ, అమరారామమూ అనే పంచారామములు శైవులకు ప్రధాన క్షేత్రములుగా ఉండేవి.

వేంగిచాళుక్యుల కాలంలో తెలుగుభాష బాగా అభివృద్ధి చెందింది. రాజరాజ నరేంద్రుని ఆస్థానంలో రాజమహేంద్రవరంలో అనేక మంది కవులూ, పండితులూ ఉండేవారు. వారిలో నన్నయభట్టు అనే మహాకవి ఆంధ్రమహాభారతాన్ని ప్రారంభించి రెండున్నర పర్వములు వ్రాశాడు. అది ఆదర్శంగా అప్పటినించీ అనేకమంది కవులు తెలుగు భాషలో అనేక కావ్యములను రచించారు.

ఈ చాళుక్యరాజులలో అనేకమంది మహాశైవులు. వారిలో నరేంద్రమృగరాజ విజయాదిత్యుడు తన పేర నూట ఘెనిమిది శివాలయములు నిర్మించాడు. గుణగవిజయాదిత్యుని

కాలంలో బెజవాడలోనూ, భిక్కవోలులోనూ చక్కని ఆలయములు నిర్మింపబడినవి. చాళుక్య భీమమహారాజు పంచారామములలోచేరిన దక్షారామ కుమారారామములలో పెద్ద పెద్ద ఆలయములను కట్టించాడు. ఈ ఆలయములలో కొన్ని చక్కని శిల్పములు ఉన్నవి.

ఈ కాలంలో భారతీయ నాగరికతా, సంస్కృతీ ఆసియా ఖండంలోని అనేక దేశములకు వ్యాపించినవి. ఈ సందర్భంలో ఆనాటి ఆంధ్రులు అగ్రగణ్యమైన పాత్రను నిర్వహించారు. ఆనాడు తూర్పుతీరాన దక్షిణాన మదరాసునుంచి, ఉత్తరాన మహానదీ ముఖద్వారం వరకూ ఎన్నో రేవులు ఉండేవి. ఇక్కడ నించి బయలుదేరి పెద్ద పెద్ద ఓడలు ఆంధ్రదేశంనించి వర్తక సామగ్రిని చాలా విదేశాలకు తీసుకు పోయేవి. ఈ కారణంగా అనేకమంది వర్తకులు ఆయాదేశాలకి తరచుగా పోతూ ఉండేవారు, వారి వెనుక అనేకమంది ఇతరులు ఈ విదేశాలకి పోయి, అక్కడ వలసలు ఏర్పరచుకొని స్థిరపడి పోయారు. ఎందరో కవులూ, పండితులూ, శిల్పులూ, కళారాధకులూ కూడా ఈ ప్రాంతములకు వెళ్ళారు. వీరంతా అక్కడ స్థిరపడి కొన్ని రాజ్యములను కూడా నిర్మించి పరిపాలించారు. ఈ విదేశాలలో శ్రీకాకుళం, అమరావతి, కౌథరం, విజయ, సింహపుర, కళింగవంటి ఆంధ్రదేశంలో ఉండిన ఊళ్ళ పేర్లూ, రాష్ట్రముల పేర్లూ గల స్థలములు ఎన్నో ఉండేవి. అక్కడ పరిపాలన చేసిన రాజులు ఈ కాలంలో ఆంధ్రదేశాన్ని పరిపాలన చేసిన రాజవంశముల

రాజులవలె "వర్మ" అనే బిరుదమును చేర్చుకొనేవారు. ఈ దేశములలో అనేక శాసనములు దొరికినవి. ఇవి ఆనాడు ఆంధ్ర దేశంలో వాడుకలో ఉండిన లిపులలో వ్రాయబడి ఉన్నవి. వీటన్నిటిలోనూ ఇక్కడవలెనే శాలివాహన శకం వాడబడింది. ఈ దేశములలో అనేక చోట్ల పెద్ద పెద్ద హిందూదేవాలయములు ఉండేవి. వాటికీ దక్షిణదేశంలోని ఆనాటి ఆలయములకున్నూ చక్కని పోలికలు ఉన్నవి. ఈ ప్రాంతములలో దొరికిన బుద్ధ విగ్రహములు అమరావతీ బుద్ధ విగ్రహములను పోలి ఉన్నవి. అక్కడి రాజవంశముల ఉత్పత్తిని గురించి వాడుకలోకి వచ్చిన కథలు ఆంధ్రదేశం యొక్క సంబంధమును సూచిస్తాయి. బర్మాలో సాలంకాయన గోత్రీకుడైన ఆంధ్రరాజు ఒకడు పెగూ రాజ్యాన్ని పాలించాడు. అక్కడి ప్రజలలో ప్రాచీనులైన వారికి తలెంగులని పేరు. ఫునాన్ అనే రాజ్యమును పాలించిన మొదటి రాజవంశం కౌండిన్య సోమవంశం. ఆంధ్రదేశంలో గోదావరి ముఖద్వారం వద్దనుంచి వచ్చిన కౌండిన్యుడనే బ్రాహ్మణుడు, సోమ అనే ఇచ్చటి స్త్రీని పెండ్లిచేసుకోవడం వల్ల ఈ పేరుగల రాజవంశం బయలుదేరినదట. కాంభోజరాజులు కంబు అనే ఋషికిన్నీ, మీరా అనే అప్సరసకున్నూ జన్మించారట. ఇలాటిదే అశ్వత్థామకున్నూ, మదనా అనే అప్సరసకున్నూ సంబంధించిన గాథ ఒకటి ఆంధ్రదేశమును ఏలిన పల్లవ రాజులను గురించి ప్రచారంలో ఉండేది. ఈ విధంగా ఆ నాటి ఆంధ్రులు వివిధ దేశములకు పోయి అక్కడ సంస్కృతిని ప్రచారంచేసీ, రాజ్యములను స్థాపించీ కీర్తి గౌరవములను సంపాదించారు.

# కాకతీయ సామ్రాజ్యం :

వేంగి చాళుక్యుల అనంతరం ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రాజ వంశములలో కాకతీయ రాజవంశం ముఖ్యమైనది. ఈ కాకతీయ వంశపు రాజులు అనేక విజయములను ఆర్జించి, తెలుగు భాష వాడుకలో ఉండిన భాగము నంతటినీ కలిపి, ఒక మహా సామ్రాజ్యంగా ఏర్పరచి, దానిని పరిపాలించారు. ఆంధ్రులు నిర్మించి, సాగించిన మహా సామ్రాజ్యములలో శాతవాహన సామ్రాజ్యం మొదటిదీ, కాకతీయ సామ్రాజ్యం రెండవదీని. ఈ కాకతీయ సామ్రాజ్యం, కాకతీయ రాజుల పలుబడీ సాగిన క్రి. శ. 1000-1323 నడుమ గల కాలంలో ఆంధ్రదేశమూ, ఆంధ్ర ప్రజలూకూడా శాంతి సౌఖ్యములనూ, సిరి సంపదలనూ అనుభవించారు,

క్రీ, శ, 10వ శతాబ్ది తుది భాగంలో వేంగి చాళుక్య రాజ్యంలో అల్లకల్లోలములు చెలరేగినవి, ఈ సమయంలో వేంగీ చాళుక్యుల సామంతుడైన కాకతీయ గుండ్యన అనే అతడు తూర్పు కనుమల అవతల నేటి ఖమ్మంమెట్టు జిల్లాలో కొరవి ప్రాంతంలో ఉన్న కొంత భాగాన్ని వశపరచుకొని దానికి పాలకుడు అయ్యాడు, తరవాత ఇతని సంతతివారు తొమ్మిదిమంది రాజ్యం చేశారు, ఇతడు ఏర్పరచుకొన్న చిన్న

సంస్థానం ఒక పెద్ద రాజ్యం అయి, ఆమీద ఒక మహా సామ్రాజ్యం అయి ఆంధ్రదేశం అంతటినీ ఆవరించింది.

గుండ్యన అనంతరం అతని వంశీకు డయిన మొదటి బేతరాజు రాజబిరుదములను వహించి స్వతంత్రుడుగా పరిపాలన చేశాడు. ఇతని చిన్న రాజ్యానికి పడమట కల్యాణీ చాళుక్యులు, తూర్పున వేంగీ చాళుక్యులూ ఉండేవారు. దక్షిణాన చోళ రాజ్యం ఉండేది. ఇందులో చోళులకూ, కల్యాణీ చాళుక్యులకూ నిరంతరమూ యుద్ధములు జరుగుతూ ఉండేవి. వీరిరువురూ కూడా వేంగి రాజ్యంలో పలుకుబడి సంపాదించడానికి ప్రయత్నాలు చేశారు. ఈ విధంగా పరస్పరమూ విరోధం సాగించుకుంటూ ఉండిన పెద్ద రాజ్యముల మధ్య ఉండడంవల్ల కాకతీయ బేతరాజు తన రాజ్యాన్ని చాలా జాగరూకతతో రక్షించుకోవలసి వచ్చింది.

పిమ్మట బేతరాజు కుమారుడు మొదటి ప్రోలరాజు రాజ్యానికి వచ్చాడు. ఇతని కాలానికి కల్యాణీ చాళుక్యులు బాగా విజృంభించారు. తూర్పుగా ఉన్న వేంగీ రాజ్యాన్ని చేరడానికి వారు అనేక ప్రయత్నములు చేశారు. దక్షిణాన చోళుల ప్రతిభకూడా ఎక్కువ అయి, వేంగీ వారికి వశం అయినది. ఈ పరిస్థితులలో ప్రోలరాజు ఆత్మ రక్షణార్థం కల్యాణీ చాళుక్యులకు నామకః సామంతుడై, వారికి అనేక విధముల సహాయం చేసి, వారి మెప్పు పొందాడు. ఆ చాళుక్యుల

లున్నా తమ రాజ్యపు సరిహద్దులో ఉన్న ఈ ప్రోలరాజు యొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించి, అతనికి నేటి వరంగల్లు జిల్లాలో చాలా భాగంలో వ్యాపించి ఉండిన అనుమకొండ విషయమును దానంచేసి తృప్తిపరచారు.

తరవాత రెండవ బేతరాజు అధికారానికి వచ్చాడు. ఇతడు కల్యాణీ చాళుక్యులందరిలోనూ ప్రసిద్ధుడూ, బలవంతుడూ అయిన త్రిభువనమల్ల విక్రమాదిత్య చక్రవర్తికి సామంతుడై, అతని అనుగ్రహంవల్ల సబ్బి మండలమనే ప్రాంతాన్ని సంపాదించాడు. ఇతని కాలంలో అనుమకొండ నగరం రాజధానిగా ఉండేది. ఆనాడు నేటి ఖమ్మంమెట్టు, వరంగల్లు జిల్లాలు ఇతని రాజ్యంలో చేరి ఉండేవి.

రెండవ బేతరాజు అనంతరం అతని కుమారుడు రెండవ ప్రోలరాజు రాజ్యానికి వచ్చాడు, ఇతడు గొప్ప శూరుడు. ఇతని కాలంలో విక్రమాదిత్య చక్రవర్తి మరణించాడు. తరవాత వచ్చిన చాళుక్య రాజులు బలహీను లయినారు. ఈ అవకాశం పురస్కరించుకొని ప్రోలరాజు చాళుక్యుల అధికారాన్ని ధిక్కరించి స్వతంత్రుడు అయాడు, ఇతడు స్థాపించిన ఈ స్వతంత్ర పరిపాలనం చివరివరకూ నిలిచింది. ఆనాడు కాకతీయ రాజ్యం చుట్టూ అనేకమంది మండలీకులు చాళుక్యులకు సామంతులుగా పరిపాలన చేస్తూ ఉండేవారు. ప్రోలరాజు అనేక దిగ్విజయములు చేసి, ఈ మండలీకులలో చాలామందిని ఓడించి, వారి భూభాగములను వశపరచుకొని, తన రాజ్యాన్ని విస్తరించాడు.

పిమ్మట ప్రోలరాజు పెద్ద కొడుకు రుద్రదేవ మహారాజు రాజ్యానికి వచ్చాడు. ఇతడు తండ్రిని మించిన శూరుడు. ఇతడు కూడా అనేక దండయాత్రలు చేసి, మిగిలిన చాళుక్య సామంతులను ఓడించి నేటి తెలంగాణా నంతటినీ వశపరచుకున్నాడు. ఆ నాడు కోస్తా ప్రాంతంలో అనేక మంది చిన్న చిన్న మండలీకులు అన్యోన్య కలహములకు లోనై పరిపాలన సాగిస్తూ ఉండేవారు. ఈ అదను పురస్కరించుకొని రుద్రదేవ మహారాజు తూర్పు తీరం మీద దండెత్తి పోయి, ద్రాక్షారామ ప్రాంతాన్ని వశపరచుకున్నాడు. దక్షిణంగా విజయం సాగించి ఇతడు శ్రీశైల ప్రాంతాన్ని జయించాడు. ఇతడు ఆర్జించిన విజయములకు ఫలితంగా కాకతీయరాజ్యము తూర్పున సముద్రం వరకూ, ఉత్తరాన మాల్యవంతం వరకూ, పడమట కల్యాణ కటకం వరకూ, దక్షిణాన శ్రీశైలం వరకూ వ్యాపించింది. ఈ మహారాజు తన పేరు శాశ్వతంగా ఉండేటట్లుగా అనుమకొండ నగరంలో ఒక చక్కని దేవాలయం నిర్మించాడు. ఇతడు అనుమకొండ నగరం చిన్నది కావడంవల్ల ఓరుగల్లును విస్తరించి, తన రాజధానిని అక్కడికి మార్చుకున్నాడు. కాకతీయ రాజ్యానికి ఉత్తరాన దేవగిరి (దౌలతాబాదు)ని రాజధానిగా చేసుకొని యాదవరాజులు పరిపాలన చేస్తూ ఉండేవారు. సరిహద్దు రాజ్యములు కావడం వల్ల ఈ రెండు రాజ్యములకూ శత్రుత్వం పర్పడింది. ఈ కాలంలో జైత్రపాలుడనే యాదవరాజు కాకతీయ రాజ్యం మీద దండెత్తి వచ్చాడు. రుద్రదేవుడు అతనిని ఎదిరించాడు. కాని యుద్ధంలో మరణించాడు.

అనంతరం రుద్రదేవుని తమ్ముడు మహాదేవరాజు అధికారానికి వచ్చాడు. ఇతడు తన అన్నను చంపినందుకు యాదవుల మీద పగ తీర్చుకునే నిమిత్తం ఒక ప్రబలమైన సైన్యాన్ని తీసుకొని, తన కుమారుడైన గణపతి దేవుని వెంట బెట్టుకొని దేవగిరి మీద దండయాత్ర సాగించాడు. అక్కడ ఘోరమైన యుద్ధం జరిగింది. దానిలో మహాదేవరాజు మరణించాడు. అతని కుమారుడైన గణపతి దేవుని యాదవరాజులు బందీని చేశారు. ఈ వార్త విని కాకతీయ రాజ్యంలో అనేకమంది సామంతులు తిరుగుబాట్లు చేశారు. శత్రురాజులు దండెత్తి వచ్చారు. ఈ ఆపత్కాలంలో రాజభక్తులైన కాకతీయ సేనానులు ఈ శత్రువులను పారదోలి, తిరుగుబాట్లను అణచివేసి రాజ్యాన్ని రక్షించారు. కొంత కాలానికి గణపతి దేవుడు బంధవిముక్తుడై, స్వదేశానికి తిరిగి వచ్చి, రాజ్యాన్ని వశపరచుకున్నాడు.

కాకతీయ గణపతి దేవుడు ఆంధ్ర దేశాన్ని పరిపాలించిన రాజులలో అగ్రశ్రేణికి చెందినవాడు. ఆనాడు ఆపదలలో చిక్కుకొని ఉన్న రాజ్యాన్ని రక్షించుకోడమే కాకుండా ఈ మహారాజు దానిని అనేక విధముస్త్రవిల రించి, ఒక మహా సామ్రాజ్యాన్ని నిర్మించి, చక్రవర్తిగా పరిపాలన చేశాడు. ఆనాడు కోస్తా ప్రాంతంలో అనేకమంది మండలీకులు పరిపాలన చేస్తూ ఉండేవారు. ఉత్తరాన కళింగదేశం ఏలుతూ ఉండిన గాంగరాజులు ఈ మండలీకులను పదే పదే బాధించేవారు.

నెల్లూరునుంచి కంచివరకూ గల భాగంలో తెలుగు చోళరాజులు పాలించేవారు. వీరికి దక్షిణదేశపు పాలకులైన పాండ్యులవల్ల ఉపద్రవములు సంభవిస్తూ ఉండేవి. నేటి రాయలసీమ భాగంలో కూడా ఎందరో చిన్న చిన్న రాజులు ఉండేవారు. గోదావరికి ఉత్తరాన ఉండిన యాదవరాజుల వల్ల కాకతీయ రాజ్యానికి ప్రమాదములు కలుగుతూనే ఉండేవి. ఇలాంటి క్లిష్ట పరిస్థితులలో రాజ్యానికి వచ్చిన గణపతిదేవుడు ఎలాగైనా తెలుగు గడ్డని అంతటినీ తన యేలుబడిలోకి తీసుకురావలెనని సంకల్పించాడు. వీలయినంత వరకూ రాజనీతిని ఉపయోగించీ, అది సఫలంకాని పరిస్థితులలో యుద్ధములు చేసీ ఈ మహారాజు తన సంకల్ప మును నేరవేర్చుకున్నాడు. ముందుగా ఇతడు కళింగం మీదికి రెండు దండయాత్రలు పంపించి, కొంత భూమిని వశపరచుకొని, గాంగరాజుల వల్ల ఏ ప్రమాదమూ రాకుండా చేసుకున్నాడు. తరవాత కృష్ణా గోదావరీ నదుల మధ్య ప్రబలులుగా ఉండిన కోలని మండలీకులని ఇతడు జయించాడు. ఆ మీద ఈ మహా రాజు గుంటూరు కృష్ణా మండలములను రాజనీతిని ప్రయోగించి వశపరచుకున్నాడు. తరవాత నెల్లూరు తెలుగు చోళులకి బాసటగా నిలచి వారి స్నేహాన్ని సంపాదించాడు. పిమ్మట నేటి రాయలసీమ భాగంలోని మండలీకులని తనకు సామంతు లను చేసుకున్నాడు. ఈ విధంగా ఆంధ్రదేశం అంతా ఇతనిది

లోనై ఒక మహా సామ్రాజ్యం ఏర్పడింది. ఈ మహారాజు రెండు సార్లు దక్షిణదేశం మీద దండు పంపి పాండ్యరాజులను కూడా ఓడించాడు. గణపతి దేవునికి ఇద్దరు కుమార్తెలేగాని పురుష సంతతి లేకపోయింది. అందువల్ల ఇతడు తన కుమార్తెలలో పెద్దది అయిన రుద్రాంబకు రాజుకు కావలసిన శిక్షణ ఇచ్చి ఆమె తనతోపాటు సామ్రాజ్య పరిపాలనలో పాల్గొనేట్లు చేశాడు. ఈ రుద్రాంబకున్నూ పురుషసంతానం లేకపోయింది. ఆమె పెద్ద కూతురుకు మాత్రం ప్రతాపరుద్రదేవుడనే కుమారుడు కలిగాడు. గణపతిదేవుడు ఈ ప్రతాపరుద్రదేవుని తన కుమార్తె రుద్రాంబకు దత్తు చేయించాడు. ఈ విధంగా ఒక విశాలమైన సామ్రాజ్యం నిర్మించి, తన అనంతరం దాని పరిపాలనకు ముందుగానే తగిన వారసులను ఏర్పాటుచేసి, 64 సంవత్సరములు రాజ్యపరిపాలన చేసి గణపతిదేవుడు మరణించాడు.

పిమ్మట రుద్రాంబ కాకతీయ సామ్రాజ్యానికి అధిపతి అయింది. ఈమె పురుషవేషంలో కొలువుకూటంలో సభ తీర్చి, యుద్ధరంగములలో సేనాధిపత్యం వహించీ, ఇటు పరిపాలనా రంగంలోనూ అటురణరంగంలోనూ కూడా పురుషులని మించిన చాకచక్యం చూపించింది. ఈమె స్త్రీ అనే ఉద్దేశ్యంతో అనేకమంది శత్రువులు దండెత్తి వచ్చారు. కొందఱు సామంతులు

తిరుగుబాట్లు చేశారు. కాని ఈ ఉపద్రవములను బహుసమర్థతతో అణచివేసి ఈమె సామ్రాజ్యంలో శాంతిని నెలకొలిపింది. చివరికాలంలో సమర్థుడైన తన దౌహిత్రునిపైన రాజ్యభారం మోపి ఈ మహారాణి కొంత విశ్రాంతి తీసుకొని ప్రజాహిత కార్యములను ఎన్నిటినో చేసి, ఒక వంక శత్రురాజులకు దేవివలె భయం కలిపిస్తూ, ఇంకొక వంక అంబ అయి ప్రజలను కన్నబిడ్డలవలె రక్షిస్తూ 34 సంవత్సరములు పరిపాలన చేసి ఈ రుద్రమదేవి క్రీ. శ. 1296 లో మరణించింది.

తరువాత ప్రతాపరుద్రదేవుడు రాజ్యానికి వచ్చి 27 సంవత్సరములు పరిపాలించాడు. వెంటనే ఇతడు పరిపాలనా విధానాన్ని సంస్కరించాడు. ఈ కాలంలో ఉత్తర హిందూ దేశంలో ఢిల్లీ సామ్రాజ్యం వర్ధిల్లుతూ ఉండేది. దానికి ఖిల్జీ వంశీయుడైన అల్లాఉద్దీను సుల్తానుగా ఉండేవాడు. వింధ్యపర్వతాలకు దక్షిణాన సిరిసంపదలతో తులదూగుతూన్న యాదవ, కాకతీయ, హోయసల రాజ్యములను చూచి ఎలాగయినా వాటి ఐశ్వర్యమును దోచుకోవలెనని ఈ సుల్తాను సంకల్పించాడు. ఆ ఉద్దేశంతో అల్లాఉద్దీను క్రీ. శ. 1308 లో కాకతీయ సామ్రాజ్యంమీదికి ఒక సైన్యాన్ని పంపించాడు. ఆంధ్ర సైనికులు దీనిని ఓడించి, తరిమివేశారు. మరుసటి సంవత్సరం ఢిల్లీనుంచి మరి ఒక సైన్యం వచ్చి. రాజధాని అయిన ఓరుగల్లు

నగరమును ముట్టడించింది. ఈ ముట్టడిని అరికట్టడానికి కావలసినంత సైన్యం అప్పుడు తన వద్ద లేనందున ప్రతాపరుద్రదేవుడు సుల్తాను సేనానితో సంధి చేసుకున్నాడు. ఇంతలో కడప ప్రాంతంలో ఒక తిరుగుబాటు జరిగింది. ప్రతాపరుద్రుడు స్వయంగా ఆ ప్రాంతానికి పోయి, ఈ తిరుగుబాటును అణచివేసి ఆ ప్రాంతములో విరివిగా ఉండిన అడవులను నిర్మూలించి, అక్కడ అనేక గ్రామములను నిర్మించి ప్రజలకు వసతులను కలిపించాడు. మరి కొంతకాలానికి దక్షిణ దేశపు పలికలు అయిన పాండ్యులు నెల్లూరు తెలుగు చోళులను ఓడించి కాంచీనగరమును పట్టుకున్నారు. తన సామంతులైన తెలుగు చోళుల తరఫున దక్షిణంగా దండయాత్ర సాగించి ఈమహారాజు ఆ నగరమును జయించాడు. ఈ సందర్భంలో కాకతీయ సైన్యములు తిరుచినాపల్లి వద్ద ఉన్న జంబుకేశ్వరం వరకూ చొచ్చుకుపోయినవి. ఇప్పటికి ఢిల్లీలో ఖిల్జీ వంశీకుల పరిపాలన అంతరించి, తుగ్లకు వంశీయులు పాలకులు అయారు. ఈ వంశపు సుల్తాను అయిన ఘియాసుద్దీను దక్షిణాపథంలోకి తన సామ్రాజ్యమును విస్తరింపచేయవలెనని సంకల్పించాడు. అతడు తన కుమారుడైన ఉలుగ్ ఖానుకు తగినంత సైన్యం ఇచ్చి ఈ ప్రాంతం మీదికి పంపించాడు. ఈ వచ్చిన ఢిల్లీ సైన్యానికిన్నీ కాకతీయ సైన్యములకున్నూ ఓరుగల్లు వద్దనూ, కోటగిరి వద్దనూ

యుద్ధములు జరిగినవి. ఈ రెండు యుద్ధములలోనూ కూడా ఓడిపోయి ఉలుగ్‌ఖాను దేవగిరికి పారిపోయాడు. ఈలోగా కాకతీయ సామ్రాజ్యపు దక్షిణభాగాన కొంత అశాంతి బయలుదేరి కొంత సైన్యం రాజధానినించి అక్కడికి పోయింది. ఇదే సమయంలో ఉలుగుఖాను తిరిగీ దండెత్తి వచ్చాడు. అప్పుడు ఓరుగల్లు దుర్గం ఎదుట ఘోరమైన యుద్ధం జరిగింది. దీనిలో సైన్యబలం తక్కువగా ఉండడంవల్ల ప్రతాపరుద్రదేవుడు ఓడిపోయాడు. ఉలుగ్‌ఖాను అతనిని పట్టుకొని బందీగా ఢిల్లీకి పంపించాడు. కాని ఆ మహారాజు దారిలోనే మరణించాడు. ఈ విధంగా సువిశాలమైన కాకతీయ సామ్రాజ్యం క్రీ. శ. 1323 లో హఠాత్తుగా కూలిపోయింది.

ఈ కాలంలో ఆంధ్రదేశం అనేక విధముల అభివృద్ధి పొందింది. దేశం అంతా ఒకే సామ్రాజ్యంలో చేరి ఉండడంవల్ల దానికి ఒక వ్యక్తిత్వమూ, ఒక గౌరవమూ లభించినవి. గణపతి దేవ చక్రవర్తి అడుగుజాడలలో నడిచి రుద్రాంబా, ప్రతాప రుద్రదేవుడూ సామ్రాజ్యానికి స్థైర్యమును చేకూర్చారు. పదే పదే విదేశీయులు దండెత్తి వస్తూంటే పూనికతో దేశ స్వాతంత్ర్యమును కాపాడడానికి ప్రబల ప్రయత్నం చేసిన ప్రతాప రుద్రదేవుడు తరవాత వారికి ఆదర్శప్రాయుడు అయాడు. అతని అనంతరం స్వాతంత్ర్యోద్యమమును సాగించినవారూ-

స్వతంత్ర రాజ్యములను స్థాపించి పాలించినవారూ అతని లక్ష్యములనే అనుసరించారు.

కాకతీయ రాజులు దేశాన్ని అనేక నాయంకరములుగా విభజించి, వాటిలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క నాయకుని నియమించారు. ఆనాటి ప్రభుత్వ విధానంలో అనేకమంది ఉద్యోగులు ఉండి దేశ పరిపాలనను శ్రద్ధతో నిర్వహించేవారు. రాజులూ, సామంతులూ, పెద్ద పెద్ద ఉద్యోగులూ ప్రజా క్షేమాన్నే ప్రధానమైన లక్ష్యంగా ఉంచుకున్నారు. ఆనాటి పరిపాలనా విధానం సర్వ శ్రేయస్కరంగా ఉండేది.

ఆనాడు ఆంధ్రదేశం సిరిసంపదలతో తులతూగుతూ ఉండేది. వ్యవసాయం ప్రజల ముఖ్యవృత్తిగా ఉండేది. ప్రతాప రుద్రదేవుడు నేటి కర్నూలు మండలంలో అడవులను నరికించి చాలా భూమిని సాగులోనికి తీసుకురావడానికి సహాయం చేశాడు. రాజులూ, సామంతులూ పెద్ద పెద్ద తటాకములను నిర్మించి వ్యవసాయదారులకు బహువిధముల సహాయం చేశారు. దేశంలో అనేక పరిశ్రమలు సాగేవి. వీటిలో పనిచేసే కార్మికులు సంఘములుగా ఏర్పడి తమ తమ వృత్తులను సాగించుకునేవారు. ఈ కాలంలో వాణిజ్యం విరివిగా సాగింది. వర్తకులుకూడా సంఘములుగా ఏర్పడి దేశంలోని వివిధ భాగములతోనూ, అనేక విదేశములతోనూ వర్తకం సాగించేవారు. ఆనాటి ఆంధ్ర

దేశానికి మోటుపల్లి రేవు ముఖ్యమైన విదేశ వాణిజ్యకేంద్రంగా ఉండేది. ఆ రేవుద్వారా వర్తకులు బర్మా, చైనా, సింహళమూ, సుమాత్రా, మలే, పర్షియా మొదలయిన దేశములతో ఎగుమతి దిగుమతి వ్యాపారమును సాగించేవారు.

ఆనాటి సంఘంలో ప్రధానములైన నాలుగు వర్ణములే కాక వాటిలో ఎన్నో శాఖోపశాఖలు ఉండేవి. ప్రజలు వారి వారికి పరంపరగా వచ్చిన వృత్తులను సాగించుకుంటూ వైషమ్యములు లేకుండా జీవించేవారు. దేశంలో సిరి సంపదలు విశేషంగా ఉండడంవల్ల ప్రజలు భోగలాలసులుగా ఉండేవారు. అన్ని తరగతులవారూ సుగంధ ద్రవ్యములనూ, వెండిబంగారములనూ, విలువగల దుస్తులనూ ఉపయోగించేవారు. సంగీతమూ, నృత్యమూ, చిత్రలేఖనమూ, జూదమూ వారికి ముఖ్యములైన వినోదములుగా ఉండేవి.

ఈ కాలంలో జైనమతం క్రమక్రమంగా క్షీణించిపోయింది. శైవం బాగా ప్రబలింది. ప్రజాసామాన్యంలో వీరశైవం బాగా వ్యాపించింది. వైష్ణవ మతమున్నూ బాగా వర్ధిల్లింది. ఈ యీ మతముల దేవతలకొరకు దేశంలో అనేక చోట్ల పెద్ద పెద్ద దేవాలయములు నిర్మించబడినవి. మత ప్రచారం కొరకు అనేక మఠములు ఉండేవి.

ఇది ఆంధ్ర వాఙ్మయం బాగా అభివృద్ధి పొందిన కాలం. నన్నయభట్టు రచించిన ఆంధ్ర మహాభారత భాగమును

వరవడిగా పెట్టుకొని అనేకమంది కవులు ఎన్నో కావ్యములను రచించారు. నెల్లూరు తెలుగు చోళుల ఆస్థానమును అలంకరించిన తిక్కన సోమయాజి అనే మహాకవి మహాభారతంలో పదిహేను పర్వములను రచించి పూర్తి చేశాడు. పిమ్మట ప్రోలయ వేమారెడ్డి అనే కొండవీటి రెడ్డిరాజు ఆదరణ పొందిన ఎఱ్ఱాప్రగడ అనే ఇంకొక మహాకవి భారతంలోని అరణ్యపర్వమును పూర్తి చేశాడు. ఆమీద శ్రీనాథ మహాకవి కొండవీడు, రాజమహేంద్రవరం రెడ్ల ఆస్థానములలో ఉండి అమూల్యములైన కావ్యములను రచించాడు. మల్లికార్జున పండితారాధ్యుడూ, పాల్కురికి సోమనాథుడూ మొదలైన శివకవులు ప్రజలలో



వేయి స్తంభాల దేవాలయము

శైవమత ప్రచారం చేసే నిమిత్తం దేశీయ చ్ఛందస్సులలో సులభమైన భాషలో ఎన్నో గ్రంథములు రచించారు. కాకతీయ

ప్రతాపరుద్రదేవుని ఆస్థానంలో విద్యానాథుడూ, శాకల్య మల్ల కవీ, విశ్వనాథుడూ వంటి సంస్కృత కవులు ఎందరో ఉండేవారు.

ఈ కాలంలో లలితకళలు అనేక విధముల వర్ధిల్లినవి. హానుమకొండ, వరంగల్లు, రామప్ప, పిల్లలమఱ్ఱి, నాగులపాడు, ఉప్పరపల్లి మొదలయినచోట్ల చక్కని శిల్పంతో శోభించే ఆలయములు నిర్మించబడినవి.

ఈ విధంగా కాకతీయ సామ్రాజ్యం సాగిన కాలంలో ఆంధ్రదేశం అపూర్వమైన శోభను అనుభవించింది.



## రెడ్లు, వెలమలు :

ప్రతాపరుద్రదేవుని ఢిల్లీకి పంపించిన తరువాత ఉలుగ్ ఖాను తెలంగానా భాగాన్ని అంతటినీ జయించాడు. ఆ మీద ఇంకా దక్షిణంగా దండెత్తి పోయి అతడు మరికొంత ప్రాంతాన్ని జయించి, కోస్తాప్రాంతంమీదికి వచ్చి, దానినికూడా జయించి, ఓఢ్రదేశం మీదుగా ఢిల్లీకి మరలిపోయాడు. అక్కడ తన తండ్రిని చంపించి అతడు మహమ్మద్ బిన్ తుగ్లక్ అనే పేర ఢిల్లీ సింహాసనం అధిష్ఠించాడు. అతని సామ్రాజ్యం దక్షిణాన బహుదూరం వ్యాపించి ఉండేది. అతని కాలంలో ఈ భాగంలో అనేక కల్లోలములు బయలుదేరి తుదకు నాలుగు స్వతంత్ర రాజ్యములు అవతరించినవి.

ఉలుగ్ ఖాను తాను జయించిన ప్రాంతములను పరిపాలించడానికి అనేకమంది ఉద్యోగులను నియమించాడు. ఈ ఉద్యోగులు ఆంధ్రదేశంలోని ప్రజలను అనేక విధముల హింసించారు. అప్పటికి ప్రతాపరుద్రదేవునితోపాటు దేశ స్వాతంత్ర్యమును కాపాడడంకొరకు అనేక యుద్ధములుచేసిన నాయకులు చాలామంది జీవించి ఉన్నారు. ప్రజలు పడుతున్న బాధలను చూచి సహించలేక వీరు ప్రతాపరుద్ర చక్రవర్తి పేర ప్రజలలో ఉత్సాహం కల్పించి అనేక విప్లవములు కలిపించారు. ఎక్కడి ప్రజలు అక్కడే తిరగబడి, అక్కడి మహమ్మదీయులను పార

ద్రోలి స్వతంత్రులు అయ్యారు. మొట్టమొదట రాజమహేంద్రవరం ప్రాంతం స్వతంత్రం అయింది. ఆ మీద ప్రోలయ వేమన అనే రెడ్డి వీరుడు గుంటూరు, నెల్లూరు జిల్లాలను వశపరచుకొని ఒక స్వతంత్ర రాజ్యం స్థాపించాడు. ముసునూరి ప్రోలయ నాయకుడనే వీరుడు ఏజెన్సీ ప్రాంతాన్ని విడిపించి వశపరచుకున్నాడు. సోమదేవరాజు అనే మరి ఒక నాయకుడు నేటి రాయలసీమ భాగాన్ని విడిపించాడు. రేచర్ల సింగమనాయకుడనే వెలమవీరుడు దక్షిణ తెలింగానాని వశపరచుకుని ఒక స్వతంత్రరాజ్యం స్థాపించాడు. మరి కొద్దికాలానికే పూర్వం కాకతీయ ప్రతాపరుద్రదేవుని కొలువులో ఉద్యోగులుగా ఉండిన హరిహరుడు, బుక్కరాయలు అనే సోదరులు క్రీ.శ. 1336లో విజయనగర పట్టణమును స్థాపించి, మరి ఒక స్వతంత్ర రాజ్యం నిర్మించారు. క్రీ. శ. 1347 లో కొందరు మహమ్మదీయ సర్దారులు మహమ్మదు తుగ్లకును ధిక్కరించి, దక్షిణాపథంలో ఒక స్వతంత్ర మహమ్మదీయ రాజ్యమును స్థాపించారు. ఈ రాజ్యం బహమనీ రాజ్యం అని ప్రసిద్ధి చెందింది. ఈ విధంగా దక్షిణాపథంలోని తుగ్లకు సామ్రాజ్యం ఛిన్నాభిన్నం అయింది.

" కాకతీయ ప్రతాపరుద్రదేవుడి కాలంలో పంట వంశీకుడైన ప్రోలయ వేమారెడ్డి అనే వీరుడు అతనివద్ద ఒక నాయకుడుగా ఉండి నేటి గుంటూరు, నెల్లూరు జిల్లాలలో కొంత భాగం పరిపాలిస్తూ ఉండేవాడు. కాకతీయ సామ్రాజ్యం పడిపోయిన తరువాత ఇతడు మహమ్మదీయులను పారద్రోలి తన

యేలుబడిలో ఉండిన ప్రాంతమునకు స్వతంత్రుడు అయాడు. ఈ విధంగా రెడ్ల స్వతంత్ర పరిపాలన ప్రారంభం అయింది. ఈ

కొండవీటి రెడ్డిరాజులు

రెడ్డి రాజ్యానికి అద్దంకి రాజధానిగా ఉండేది. తన రాజ్యంలో శాంతిని నెలకొలిపి ప్రోలయ వేమన అనేక ప్రజాహిత కార్యములను చేశాడు. తురుష్కులు లాగుకొనిన మడి మాన్యములను తిరిగి నిలవబెట్టి ఇతడు విద్వాంసులకు అనేక అగ్రహారములను దానం చేశాడు. శ్రీశైల పర్వతానికీ, అహోబల పర్వతానికీ యాత్రికుల సౌకర్యం కొరకు ఇతడు మెట్లు చెక్కించాడు.

పిమ్మట ప్రోలయ వేమన కుమారుడు అనపోతారెడ్డి రాజ్యానికి వచ్చాడు. ఇతని రాజ్యకాలంలో చాలా ప్రమాదములు సంభవించినవి. దక్షిణాన విజయనగరరాజులు దండెత్తి వచ్చి, నెల్లూరు జిల్లాలో కొంతభాగం ఆక్రమించారు. పడమట నుంచి వెలమవారూ, బహమనీ సుల్తానులూ దండయాత్రలు సాగించారు. ఉత్తరాన ప్రబలులైన చోళ రాజులు శత్రువులు అయ్యారు. అనపోతారెడ్డి ఈ ప్రమాదములను తట్టుకొని తన రాజ్యాన్ని నిలవపెట్టుకున్నాడు. ఈ రాజు గుంటూరుజిల్లాలో నరసరావుపేటవద్ద కొండలలో ఒక బలిష్ఠమైన దుర్గాన్ని నిర్మించి, దానికి "కొండవీడు" అని పేరు పెట్టి తన రాజధానిని అక్కడికి మార్చాడు.

తర్వాత అనపోతారెడ్డి తమ్ముడు అనవేమారెడ్డి అధికారానికి వచ్చాడు. మహా శూరుడైన ఈ రాజు ఉత్తరాన సింహాచలంవరకూ దండయాత్రచేసి కొంత భాగాన్ని, పడమట వెలమవారినీ ఓడించి కొంత భాగాన్నీ కలుపుకొని రెడ్డి రాజ్యాన్ని విస్తరించాడు. దక్షిణాన విజయనగ్గరంవారు ఆక్రమించిన భాగములను తిరిగీ వశపరచుకున్నాడు. ఇతడు అనేకమంది కవులనూ, పండితులనూ పోషించి చాలా దాన ధర్మములను చేశాడు.

అనంతరం అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరిరెడ్డి రాజ్యానికి వచ్చాడు. ఈ రాజు గొప్ప విద్వాంసుడూ, రసికుడూ. సంగీత నాట్యములు ఇతనికి అభిమాన కళలు. ఇతని ఆస్థానంలో లకుమాదేవి అనే నర్తకి ఉండేది. ఆమె నాట్యశాస్త్రంలో చెప్పబడిన అంశములకు తన నాట్యం ద్వారా కొత్త కొత్త అర్థములను స్ఫురింపచేస్తూంటే వాటికి తన పాండిత్యమును జోడుచేసి "కుమారగిరి తన పేర"వ సంతరాజీయం, అనే నాట్య గ్రంథాన్ని రచించాడు. ఈ రాజు ప్రతి సంవత్సరమూ వసంతోత్సవములను జరిపించి ఆ సందర్భంలో అనేకమంది కవులనూ, పండితులనూ, కళాకారులనూ గౌరవించేవాడు. ఇతడు ఈ విధంగా వినోదములతో కాలక్షేపం చేస్తూంటే ఇతని బావమరదీ, మంత్రీ అయిన కాటయ వేమన రాజ్యభారాన్ని వహించేవాడు. ఈ కాటయ వేమన ఉత్తర దిశకు దండయాత్ర సాగించి చిలక సరస్సువరకూ పోయి, రాజమహేంద్రివరం

సింహాచలం మధ్యగల భాగాన్ని జయించాడు. కుమారగిరి ఈ ప్రాంతాన్ని ఒక రాజ్యంగా ఏర్పరచి దానిని కాటయ వేమనకి దానం చేశాడు. కాటయ వేమన అలాగ రాజమహేంద్రవరం వెళ్ళగానే ఒకవైపునించి విజయనగరం రాజులు దండెత్తి వచ్చారు. ఇంకొకవైపున పెద కోమటి వేమారెడ్డి అనే దాయాది కొంత రాజ్యం ఆక్రమించాడు. ఈ ఉపద్రవములను తట్టుకోలేక కుమారగిరి రాజమహేంద్రవరం వెళ్ళిపోయాడు.

పిమ్మట పెద కోమటి వేమారెడ్డి కొండవీడు రాజ్యమును ఆక్రమించాడు. కుమారగిరి మరణానంతరం కాటయ వేమన రాజమహేంద్రవర రాజ్యానికి స్వతంత్ర పాలకుడు అయ్యాడు. అంతటినించీ వీరికి ఇద్దరికీ ప్రబలమైన శత్రుత్వం ఏర్పడి ఇతర రాజ్యముల రాజులు వీరి యుద్ధములలో కలగ చేసుకోవలసి వచ్చింది. పెద కోమటి వేమారెడ్డి బహమనీ సుల్తానుతో సఖ్యం చేసుకొని అతని సహకారంతో విజయనగర రాజ్యంమీద దండెత్తాడు. దీనికి ప్రతీకారంగా కాటయ వేమన విజయనగరంవారి సహాయం కోరాడు. గోదావరీ దక్షిణ తీరాన కాటయ వేమనా, విజయనగర సైన్యమూ కలిశారు. పెదకోమటి వేమనా, బహమనీ సుల్తానూ, వెలమవారూకూడా అక్కడికి చేరారు. అక్కడ జరిగిన యుద్ధములలో కాటయ వేమన మరణించాడు. విజయనగర సైన్యం ఓడిపోయి స్వదేశానికి మరలింది. తర్వాత వెలమవారితో జరిగిన ఒకయుద్ధంలో పెదకోమటి వేమారెడ్డి మరణించాడు. తన రాజ్యకాలం

అంతా ఇలాగ ఒడుదుడుకులతోనే గడిచిపోయినా ఈ రెడ్డి రాజు అనేక విధముల సాహిత్య సేవ చేశాడు. సంస్కృత, ప్రాకృతములలో గొప్ప పండితుడై ఈ రాజు అనేక గ్రంథములను రచించాడు. సుప్రసిద్ధాంధ్ర కవి అయిన శ్రీనాథ కవి ఇతని ఆస్థానంలో విద్యాధికారిగా ఉండి అనేక గ్రంథములను రచించాడు.

పెదకోమటి వేమారెడ్డి అనంతరం అతని కుమారుడు రాచవేమన రాజు అయినాడు. ఇతడు దుర్మార్గుడై ప్రజలను అనేక విధముల బాధలు పెట్టాడు. తుదకు ఇతని ఆశ్రితులు ఇతనిని చంపివేశారు. ఇంతటితో కొండవీటి రెడ్డి రాజ్యం నశించింది. దానిని విజయనగరం రాజులు తమ రాజ్యంలో కలుపుకున్నారు.

**రాజమహేంద్రవర రెడ్డిరాజ్యం**

ఈ రాజ్యం కుమారగిరిరెడ్డిచేత ఏర్పరచబడి, అతని మరణానంతరం స్వతంత్ర రాజ్యం అయింది. దీనిని కాటయ వేమారెడ్డి కొంతకాలం పరిపాలించాడు. ఆ మీద ఆతని సేనాని అయిన అల్లాడరెడ్డి తన రెండవ కుమారుడైన వీరభద్రా రెడ్డికి కాటయ వేమన కుమార్తెను వివాహం చేశాడు. ఈ వీరభద్రా రెడ్డి కొద్దికాలం పరిపాలన చేశాడు. శ్రీనాథ మహాకవి ఈ కాలంలో ఇతని ఆస్థానంలో ఉండి గ్రంథ రచన చేశాడు. తుదకు ఒరిస్సా పాలకులైన గజపతులు ఈ రెడ్డి రాజ్యాన్ని జయించి వశపరచుకున్నారు.

క్రీ. శ. 1323 లో కాకతీయ సామ్రాజ్యం పడిపోగానే ఎక్కడ ఉండిన నాయకులు అక్కడ స్వతంత్రులు అయారు. ఈ కాలంలో పద్మనాయక వెలమ వంశీకుడైన రేచెర్ల సింగమ నాయకుడు దక్షిణ తెలంగాణాలో స్వతంత్రుడై దేవరకొండనుంచి పరిపాలన సాగించాడు. ఈ విధంగా ఏర్పడిన ఈ స్వతంత్ర రాజ్యం కొంతకాలం సాగింది. ఆ మీద రాజ్య విభజన జరిగి ఒక శాఖవారు రాచకొండనుంచి రాజ్యం చేశారు.

వెలమవారు

సింగమనాయకుని తర్వాత వచ్చిన వెలమరాజులు ఎన్నో ఆపదలను ఎదుర్కొనవలసి వచ్చింది. పడమటినించి బహామనీ సుల్తానులూ, తూర్పునించి కొండవీటి రెడ్లూ వీరి రాజ్యంమీద పదేపదే దండయాత్రలు సాగించారు. మధ్య మధ్య విజయనగరం రాజులున్నూ ప్రమాదములు కలిపించేవారు. అనపోతానాయకుడు, మాదానాయకుడు, లింగమనాయకుడు వంటి మహాశూరులు ఈ ఉపద్రవములనుతట్టుకుంటూ, తమరాజ్యాన్ని రక్షించుకుంటూ వచ్చారు. ఈ వంశంలోని మూడవ సింగమ నాయకుడు గొప్ప పండితుడు. అతనికి "సర్వజ్ఞుడు" అనే బిరుదు ఉండేది.

తుదకు అహమ్మద్‌షా అనే బహామనీ సుల్తాను ఈ వెలమ రాజ్యాన్ని వశపరచుకున్నాడు. ఈ రాజ వంశీకులు దక్షిణ దేశానికి పోయి విజయనగర సామ్రాజ్యంలో సేనానులుగా ఉంటూ వచ్చారు.

## విజయనగర సామ్రాజ్యం :

దక్షిణ భారతంలో వర్ధిల్లిన సామ్రాజ్యములలో విజయనగర సామ్రాజ్యం చాలా గొప్పది. మహమ్మదీయుల పరిపాలన దక్షిణ దేశంలోకి వ్యాపించకుండా చిరకాలం నిరోధించి, ఈ సామ్రాజ్యం దేశ స్వాతంత్ర్యాన్ని, హిందూమతాన్ని, హిందూ సంస్కృతినీ రక్షించి పెంపొందించింది. ఈ సామ్రాజ్యం వర్ధిల్లిన కాలంలో దక్షిణభారతం అపూర్వమైన శోభతో ప్రకాశించింది.

కాకతీయ ప్రతాపరుద్రదేవుని కొలువులో హరిహరుడు, బుక్కరాజు అనే సోదరులు కోశాగార పాలకులుగా ఉండే వారు. వారు కాకతీయ సామ్రాజ్యంలో ఒక పౌరుడు అయిన సంగముని కుమారులు. క్రీ. శ. 1323 లో కాకతీయ సామ్రాజ్యం పడిపోయిన తర్వాత ఈ సోదరులు అప్పటికి నిలిచి ఉండిన కంపిల రాజ్యానికి పోయి, ఆ రాజు కొలువులో చేరారు. మరి కొద్దికాలానికే మహమ్మదు తుగ్లకు తుంగభద్రా తీరాన ఉండిన కంపిల రాజ్యంమీదికి ఒక సైన్యాన్ని పంపించాడు. అక్కడ జరిగిన యుద్ధంలో సుల్తాను సైనికులు ఈ యిద్దరు సోదరులనీ, మరికొందరినీ బందీలను చేసి ఢిల్లీకి తీసుకుపోయారు. కంపిలని పరిపాలించడానికి సుల్తాను ఒక మహమ్మదీయ ఉద్యోగిని నియమించాడు. కొంతకాలానికి ప్రజలు తిరుగుబాటు చేసి ఈ ఉద్యోగిని తరిమివేశారు. అందువల్ల సుల్తాను హరిహరునీ,

బుక్కరాజునీ విడుదలచేసి, హరిహరుని పాలకునిగానూ, బుక్కరాజుని సేనాపతిగానూ నియమించి, వారికి ఒక సైన్యం ఇచ్చి కంపిల ప్రాంతానికి పంపించాడు. ఇక్కడికి వచ్చి ఈ సోదరులు చుట్టుపక్కల ఉన్న భాగమును వశపరచుకొని శాంతిని నెలకొల్పారు. ఆ మీద అక్కడ ఒక స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించవలెననే ఉద్దేశం వారికి కలిగింది. అప్పుడు ఆ ప్రాంతంలో విద్యారణ్యస్వామి అనే మహా మేధావీ, విద్వాంసుడూ ఉండేవాడు. ఆయన ఈ సోదరులను ఆదరించి ప్రోత్సహించాడు. ఈ సోదరులు క్రీ. శ. 1336 లో తుంగభద్రా దక్షిణ తీరాన విజయనగరమూ, విద్యానగరమూ అనే పేర ఒక నగరం నిర్మించి, దానిని అప్పటికి తమ వశంలో ఉండిన ప్రాంతానికి కేంద్రంగా ఏర్పరచుకొని, సుల్తాను అధికారమును ధిక్కరించి, స్వతంత్రులు అయారు.

ఈ విధంగా ఏర్పడిన ఈ రాజ్యం త్వరలోనే దక్షిణ దేశం అంతా వ్యాపించి ఒక మహా సామ్రాజ్యంగా మారింది. క్రీ. శ. 1347 లో దక్షిణాపథంలో బహమనీ రాజ్యం అనే ఒక స్వతంత్ర మహమ్మదీయ రాజ్యం స్థాపించబడింది. ఈ రాజ్యపు సుల్తానులకున్నూ, విజయనగర పాలకులకున్నూ నిరంతరమూ యుద్ధములు జరుగుతూ వచ్చాయి. బహమనీ రాజ్యం పడిపోయిన తర్వాత ఐదు స్వతంత్ర మహమ్మదీయ రాజ్యములు బయలుదేరినవి. వీటిలో బిజాపుర సుల్తానులూ, గోలకొండ సుల్తానులూ విజయనగర సామ్రాజ్యంమీద పదేపదే

దండయాత్రలు సాగించారు. క్రీ. శ. 1565 లో ఈ సుల్తాను లందరూ చేరి రక్కసితగడి అనేచోట యుద్ధం చేసి, ఈ సామ్రాజ్య సైన్యములను ఓడించి, దీని రాజధానీ నగరాన్ని నాశనం చేశారు. దానితో విజయనగర సామ్రాజ్యం పెద్ద దెబ్బ తిన్నది. అయినా ఈ సామ్రాజ్యం మరి ఒక శతాబ్ది వరకూ సాగి క్రమక్రమంగా క్షీణించి, అంతరించిపోయింది. ఈ సామ్రాజ్యమును సంగమ, సాళువ, తుళు, ఆరవీడు అనే పేరు గల నాలుగు వంశములవారు పరిపాలించారు.

సంగమ వంశం

విజయనగర రాజ్యాన్ని పరిపాలించిన మొదటి రాజు హరిహరరాయలు. ఇతడు తన తమ్ములనూ, పుత్రులనూ, బంధువులనూ వివిధ ప్రాంతములకు పాలకులుగా ఏర్పరచి రాజ్యాన్ని జాగ్రత్తగా రక్షించాడు. ఇతని కాలంలో మొట్టమొదటిసారి బహమనీ సుల్తానులు దండెత్తి వచ్చారు.

పిమ్మట హరిహరుని తమ్ముడైన బుక్కరాయలు రాజ్యానికి వచ్చాడు. ఈ కాలంలో దక్షిణదేశంలో మధురలో కొందరు సుల్తానులు పరిపాలన చేస్తూ ఉండేవారు. బుక్కరాజు కుమారుడైన కంపరాయలు దక్షిణంగా దండెత్తిపోయి మధుర, జింజీ, శ్రీరంగం ప్రాంతాలను జయించి విజయనగర సామ్రాజ్యమును ఆ దిక్కుగా విస్తరించాడు. ఈ కాలంలోకూడా బహమనీ సుల్తానులతో యుద్ధములు జరిగినవి.

పిమ్మట రెండవ హరిహరరాయలు రాజ్యానికి వచ్చాడు. అప్పటికి విజయనగర సామ్రాజ్యం నేటి నెల్లూరు జిల్లాలోనికి వ్యాపించి ఉండేది. దానికి ఉత్తరాన ఉండిన కొండవీటి రెడ్డి రాజులు ఆపదలలో చిక్కుకొని ఉండిన అవకాశం పురస్కరించుకొని హరిహరుడు ఆ రాజ్యంలోని దక్షిణ భాగాన్ని జయించి వశపరచుకున్నాడు. ఈ రాజు మరణించిన తర్వాత ఇతని కుమారులు సింహాసనంకొరకు తగవులాడుకున్నారు. వారిలో రెండవ బుక్కరాయలు కొద్దికాలం రాజ్యం చేశాడు.

తరవాత మొదటి దేవరాయలు రాజ్యం ఆక్రమించాడు. ఇతని కాలంలో బహమనీ సుల్తాను కృష్ణ దాటి, విజయనగర సామ్రాజ్యంలో ప్రవేశించి, రాజధానీ నగరమును అలజడి పరచాడు.

ఆ మీద రెండవ దేవరాయలు రాజ్యానికి వచ్చి సామ్రాజ్యాన్ని ఎక్కువ సామర్థ్యంతో పరిపాలించాడు. ఈ కాలంలో కొండవీటి రెడ్డి రాజులలో కడపటివాడైన రాచ వేమారెడ్డి మరణించాడు. ఆ అవకాశం పురస్కరించుకొని దేవరాయలు కొండవీటి రాజ్యాన్ని ఆక్రమించి, తన సామ్రాజాన్ని కృష్ణానదివరకూ విస్తరించాడు. దక్షిణాన మలబారుకూడా ఇతనికి వశం అయింది. ఈ కాలంలో కొందరు విదేశీయులు విజయనగర సామ్రాజ్యాన్ని చూచి దేవరాయల పరిపాలనావిధానాన్నీ, ఆనాడు సామ్రాజ్యమూ, దానిలోని ప్రజలూ అనుభవిస్తూ ఉండిన వైభవమునూ అనేక విధముల శ్లాఘించాగు.

రెండవ దేవరాయల అనంతరం ఇతని వంశీకుల అధికారం క్రమ క్రమంగా క్షీణించింది. మల్లికార్జున రాయల కాలంలో అప్పుడు ఒరిస్సాను పరిపాలిస్తూ ఉండిన కపిలేశ్వర గజపతి అనే రాజు దండెత్తి వచ్చి, నెల్లూరువరకూగల కోస్తా ప్రాంతాన్ని వశపరచుకున్నాడు. ఆమీద అతడు దక్షిణదేశంలో ప్రవేశించి తిరుచినాపల్లివరకూ చొచ్చుకు పోయాడు. బహామనీ సుల్తానులున్నూ కొంత కలవరం కలిగించారు. పిమ్మట విరూపాక్షరాయలు రాజ్యానికి వచ్చాడు. ఇతని కాలంలో బహామనీ సుల్తానులు విజృంభించి, నేటి కృష్ణా గోదావరి జిల్లాలను వశపరచుకున్నారు. అనంతరం రాజ్యం కొరకు కలహములు బయలుదేరినవి. ఒకవంక గజపతులూ, మరి ఒక వంక బహామనీ సుల్తానులూ కల్లోలములు కలిగిస్తూంటే ఇంకొకవంక అంతః కలహములు బయలుదేరడంవల్ల సామ్రాజ్యం బాగా నీరసించి పోయింది. ఇలాటి క్లిష్ట సమయంలో సేనాని అయిన సాళువ నరసింహారాయలు సంగమ వంశీయులను త్రోసిపుచ్చి, విజయనగర సింహాసనం ఆక్రమించాడు. ఇంతటితో సంగమ వంశం యొక్క పరిపాలన అంతరించింది.

సాళువ వంశము

క్రీ. శ. 1485 లో నరసింహారాయలు రాజ్యం ఆక్రమించడంతో సాళువ వంశీయుల పరిపాలనం ప్రారంభం అయింది. ఈ రాజున్నూ, ఇతని తరవాత రాజ్యానికి వచ్చిన తమ్మారాయలున్నూ అనేక ఉపద్రవములను ఎదుర్కొనవలసి వచ్చినది. ఆ మీదట

ఇమ్మడి నరసింహుడు బాలుడుగా రాజ్యానికి వచ్చాడు. అందు వల్ల తుళు వంశీయుడైన నరసనాయకుడు రాజప్రతినిధిగా వ్యవహరించాడు. కొంతకాలం అయినాక ఇతడు రాజును పెనుగొండలో బందీగాఉంచి, దక్షిణదేశంలో కొన్ని యుద్ధములుచేసి తన అధికారాన్ని బలపరచుకున్నాడు. పిమ్మట ఈ నరసనాయకునికుమారుడు వీరనరసింహుడు రాజప్రతినిధిఅయి కొంతకాలం అయాక ఇమ్మడి నరసింహారాయలను చంపించి విజయనగర సింహాసనాన్ని ఆక్రమించాడు. ఈ కాలంలో కృష్ణకు ఉత్తరాన ఉండిన బహామనీ రాజ్యం అంతరించి, బిజాపూరు, గోలకొండ, అహమ్మదునగరము, బెరారు, బీదరులు కేంద్రములుగా ఐదు స్వతంత్ర మహమ్మదీయ రాజ్యములు బయలుదేరినవి.

తుళువ వంశము

క్రీ. శ. 1505 లో తుళువవంశానికి చెందిన వీరనరసింహుడు రాజ్యం ఆక్రమించడంతో మూడవది అయిన తుళువ వంశంయొక్క పరిపాలన ఆరంభం అయింది. వీరనరసింహుడి కాలంలో బిజాపుర సుల్తానుతో యుద్ధం జరిగింది.

అనంతరం చరిత్ర ప్రసిద్ధుడైన శ్రీకృష్ణదేవరాయలు రాజ్యానికి వచ్చాడు. ఈ మహారాజు ఆనాడు బాగా క్షీణించి ఉండిన విజయనగర సామ్రాజ్యాన్ని ఉద్ధరించి దానిని అనేక విధముల విస్తరించాడు. అనేకమంది కవులనూ, పండితులనూ పోషించి అమూల్యమైన వాఙ్మయసేవ చేశాడు. వాస్తు శిల్ప సంగీత కళలను విశేషంగా ప్రోత్సహించాడు. ముఖ్యమంత్రి

అయిన తిమ్మరుసు అన్ని సందర్భములలోనూ రాయలకు సహాయం చేసి విజయనగర సామ్రాజ్యానికి అద్భుతమైన దోహదం కలిపించాడు. అప్పటికి ఒకవంక బిజాపుర సుల్తానులూ, ఇంకొకవంక గజపతులూ సామ్రాజ్యంలో చాలా భాగాన్ని ఆక్రమించి ప్రబల శత్రువులుగా ఉన్నారు. కృష్ణరాయలు అవసరమైన అర్ధబలం, అంగబలం సమకూర్చుకొని మొట్టమొదట ఉత్తరదిశకు ఒక దండయాత్ర సాగించాడు. ఈ యాత్రలో అతడు బిజాపుర సుల్తానును యుద్ధంలో చంపి, అతని రాజ్యంలో గుల్బర్గా వరకూ చొచ్చుకొని పోయి, అక్కడ బందీగా ఉండిన బహమనీ వంశీ



కుడిని ఒకనిని సింహాసనం ఎక్కించి శ్రీకృష్ణదేవరాయలు "యవన రాజ్యస్థాపనాచార్య" అనే బిరుదు వహించాడు. పిమ్మట దక్షిణంగా దండెత్తిపోయి రాయలు శివసముద్రం, ఉమ్మత్తూరు మొదలయిన కేంద్రముల పాలకులు చేసిన తిరుగుబాట్లను అణచివేశాడు. ఇందువల్ల స్సామ్రాజ్యంలో శాంతి సుస్థిరం అయినది. పిమ్మట కృష్ణరాయలు తూర్పుతీరాన్ని ఆక్రమించి, విజయనగర సామ్రాజ్యానికి ప్రబల శత్రువువులుగా ఉండిన గజపతులమీద దండయాత్ర సాగించాడు. ముందుగా ఇతడు

నెల్లూరు జిల్లాలోని ఉదయగిరి దుర్గాన్ని ముట్టడించాడు. ఆ దుర్గాన్ని సాధించిన తరువాత గుంటూరు జిల్లాలో ప్రవేశించి ఇతడు తంగెడ, కేతవరం, బెల్లంకొండ, నాగార్జునకొండ మొదలయిన కోటలను పట్టుకొని తుదకు మహా బలిష్ఠమైన కొండవీడు దుర్గాన్ని ముట్టడించాడు. చాలా కష్టంమీదకాని ఈ దుర్గం రాయలకు స్వాధీనం కాలేదు. అక్కడనించి బయలుదేరి బెజవాడమీదుగా పోయి రాయలు కొండపల్లి దుర్గాన్ని ముట్టడించి వశపరచుకున్నాడు. పిమ్మట ఇంకా ఉత్తరంగా సాగి రాజమహేంద్రవరం, సింహాచలములమీదుగా పోయి విజయనగర సైన్యములు గజపతుల రాజధాని అయిన కటకమును ముట్టడించినవి. గత్యంతరం లేక గజపతి రాయలతో సంధి చేసుకొని తన కుమార్తెను ఇతనికి ఇచ్చి పెండ్లి చేశాడు. ఈ విధంగా ఈ దిగ్విజయాన్ని సఫలం చేసుకొని, గజపతులవల్ల ఇకమీదట ఎలాటి ప్రమాదమూ రాకుండగా కట్టుదిట్టం చేసుకొని రాయలు విజయనగరానికి తిరిగి వచ్చాడు. ఈ దండయాత్ర సాగుతూ ఉండిన కాలంలో బిజాపుర సుల్తాను కృష్ణ దాటి వచ్చి రాయచూరు దుర్గమును ఆక్రమించాడు. అందువల్ల రాయలు ఈ ప్రాంతంమీద మరి ఒక దండయాత్ర చేయవలసి వచ్చింది. ఆ సందర్భంలో రాయచూరువద్ద ఘోరమైన యుద్ధం జరిగింది. దానిలో బిజాపుర సైన్యములు ఓడిపోయినవి. కృష్ణరాయల రాజ్యకాలంలో మిగిలిన భాగం ప్రశాంతంగా సాగి పోయింది.

కృష్ణరాయల అనంతరం అతని కుమారుడు బాలుడు కావడంవల్ల తమ్ముడు అచ్యుతరాయలు రాజ్యానికి వచ్చాడు. కృష్ణరాయల అల్లుడు అయిన రామరాయలు ఇతడిని అనేక విధముల ప్రతిఘటించాడు. ఈ అంతఃకలహములను పురస్కరించుకొని ఒకవైపునించి బిజాపుర సుల్తానూ, ఇంకొకవైపునించి గోలకొండ సుల్తానూ, మరిఒకవైపునించి గజపతులూ సామ్రాజ్యంమీద దండెత్తివచ్చారు. ఈ శత్రువులను ఎలాగో పారదోలి అచ్యుతరాయలు బయటపడ్డాడు, కాని రామరాయలు ఇతనిని హటాత్తుగా పట్టుకొని బందీని చేశాడు. తుదకు వారిద్దరూ ఎవరిమటుకు వారు స్వతంత్రులుగా తమ వశంలో ఉండిన ప్రాంతములను పరిపాలన చేసేటట్లు సంధి చేసుకున్నారు.

అచ్యుతదేవరాయలు మరణించాక అతని కుమారుడు వెంకటరాయలు బాలుడుగా రాజ్యానికి వచ్చాడు. అందువల్ల అతని మేనమామ అయిన తిరుమలుడు అతనికి ప్రతినిధిగా వ్యవహరించాడు. కొద్ది కాలానికే తిరుమలుడు తగినంత బలం చేకూర్చుకొని, బాలరాజును చంపించి, విజయనగర సింహాసనం ఆక్రమించాడు. అప్పటికి సింహాసనానికి సరియైన వారసుడైన సదాశివరాయలు పెనుగొండలో బందీగా ఉన్నాడు. రామరాయలు ఇతనిని విడిపించి, తన వెంట పెట్టుకొని విజయనగరంమీద దండెత్తి వచ్చాడు. అక్కడ జరిగిన యుద్ధంలో తిరుమలుడు మరణించాడు. రామరాయలు నగరం ఆక్రమించి, సదాశివరాయలను పట్టాభిషిక్తుడిని చేశాడు.

సదాశివరాయలు రాజు కావడంతో విజయనగర స్వామ్రాజ్య చరిత్రలో క్రొత్త శకం ప్రారంభం అయింది. కొంత కాలం అతనిని నామకః రాజుగా ఉంచి అన్ని వ్యవహారములనూ రామరాయలు తానే నిర్వహిస్తూ వచ్చాడు. తగినంత బలం చేకూరిన పిమ్మట అతడు రాజ బిరుదములను వహించి సదాశివరాయలతో సమానంగా వ్యవహరించాడు. కొంత కాలం జరిగిన తరవాత అతడు రాయలను చెరలో ఉంచి తానే రాజుగా పరిపాలన సాగించాడు. అతని తమ్ములు అతనికి అనేక విధముల సహాయం చేశారు. ఆనాడు దక్కను లోని సుల్తానులు ఒకరితో ఒకరు తగవులాడుకుంటూ ఉండే వారు. ఈ కారణం పురస్కరించుకొని రామరాయలు ఈ సుల్తానుల వ్యవహారములలో జోక్యం కలిగించుకున్నాడు. ఇతడు మొదట బిజాపుర సుల్తానును వెనకవేసుకొని అహమ్మదు నగరంమీద దండయాత్ర సాగించాడు. ఆమీద గోలకొండ సుల్తానుతో యుద్ధం చేసి అతని రాజ్యంలో కొంత భాగాన్ని వశపరచుకున్నాడు. ఈ విధంగా ఈ సుల్తానులమీద రామరాయలు గొప్ప పలుకుబడి సంపాదించి, తన సహాయం లేనిదే వారికి ఒక్క క్షణంకూడా సాగకుండా ఉండే పరిస్థితిని కలిపించాడు. కాని ఇతనికి ఇంత అధికారమూ, పలుకుబడీ రావడంతో తల తిరిగి పోయింది. అంతటినించీ ఇతడు చీటికీమాటికీ ఈ సుల్తానులతో పేచీలు తెచ్చుకోవడమూ, అడుగు అడుగుకీ వారిని అవమానించడమూ మొదలు పెట్టాడు. ఇది సుల్తాను

లందరికీ చాలా బాధ కలిగించింది. తుదకు వారు ఒకచోట సమావేశమై, తమతమ బలములను కూడగట్టుకొని ఎలాగయినా రామరాయలకు బుద్ధి చెప్పవలెనని నిశ్చయించుకున్నారు. క్రీ. శ. 1565 లో ఈ దక్కను సుల్తానులు ఒక ప్రబలమైన సైన్యాన్ని సమకూర్చుకుని, కృష్ణానదిని దాటి, రక్కసి, తగడి అనే పేర్లు గల రెండు గ్రామముల మధ్యగల మైదానంలో మకాం చేశారు. ఈ వార్త విని రామరాయలున్నూ ఒక పెద్ద సైన్యంతో ఇక్కడికి వచ్చాడు. రెండు పక్షములవారికీ ఇక్కడ ఘోరమైన యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో ప్రమాద వశాన గుండు దెబ్బ తగిలి రామరాయలు మరణించాడు. ఇది చూచి విజయనగర సైనికులు చెల్లాచెదరై పారిపోయారు. సుల్తానుల సైన్యములు అత్యుత్సాహంతో వీరిని వెంబడించి చాలామందిని నాశనం చేశాయి. ఈ పరాజయ వార్త చేరడంతో విజయనగరంలోని ప్రజలు అదిరిపోయారు. రామరాయల తమ్ముడయిన తిరుమలరాయడు యుద్ధరంగంనించి రాజధానికి వచ్చి, వీలయినంత ధనాన్నీ, వీలయినంతమంది రాజవంశీకులనీ, చెరలో ఉన్న సదాశివరాయలనీ తీసుకొని పారిపోయాడు. దీనితో మరీ అధైర్యపడి ప్రజలు చాలామంది నగరం వదిలి వెళ్ళిపోయారు. ఇంతలో సుల్తానుల సైన్యములు విజయనగరం ప్రవేశించి అక్కడ ఆరు నెలలపాటు మకాం చేశాయి. ఈ కాలంలో ఈ మహమ్మదీయ సైనికులు నగరంలోగల సిరి సంపదలని పూర్తిగా దోచుకున్నారు. అక్కడ ఉండిన చక్కని

కట్టడములను నాశనం చేశారు. మిగిలి ఉండిన ప్రజలను బహు విధముల హింసించారు. ఈ సైన్యములు వెళ్ళిపోయిన తరవాత నగరం ఒక స్మశానంలాగ మారిపోయింది. అక్కడినించి పారిపోయినవారికి ఎవరికీ మళ్ళీ అక్కడికి రావడానికి మనస్కరించ లేదు.

**ఆర్వీటి వంశం**

విజయనగరం వదలి పోయిన తిరుమలరాయలు పెనుగొండ చేరి, సదాశివరాయలని మళ్ళీ చెరలో ఉంచి, తన కుమారులను వివిధ ప్రాంతములకు పాలకులుగ నియమించి పరిస్థితులను కొంతవరకూ సరిచేసుకున్నాడు. క్రీ.శ. 1570లో ఇతడు పట్టాభిషేకం చేసుకొని విజయనగర సామ్రాజ్యానికి రాజు అయినాడు. ఇంతటితో నాలుగవది అయిన ఆర్వీటి వంశంయొక్క పరిపాలనం ఆరంభం అయింది. ఇంతటినించీ సామ్రాజ్యం క్రమక్రమంగా క్షీణించి పోయింది. ఒక సంవత్సరంకూడా పూర్తి కాకుండగానే వృద్ధుడు అయినందువల్ల తిరుమలరాయలు రాజరికాన్ని వదులుకున్నాడు.

పిమ్మట అతని కుమారుడు శ్రీరంగరాయలు రాజ్యానికి వచ్చాడు. కృష్ణరాయల కాలంనించీ దక్షిణ దేశంలో మధుర, తంజావూరు, జింజీ మొదలయిన ప్రాంతములకు తెలుగు నాయకులు గవర్నరులుగా ఉంటూ వచ్చారు. వీరిలో మధుర జింజీల నాయకులు ఈ కాలంలో తిరుగుబాట్లు చేశారు. ఉత్తరాన బిజాపూరు, గోలకొండ సుల్తానులు దండయాత్రలు

సాగించారు. తర్వాత రెండవ వెంకటపతి రాయలు రాజ్యానికి వచ్చాడు. ఇతడు దక్షిణాన ఉండిన తెలుగు నాయకులను కూడగట్టుకొని, శత్రురాజులని పారద్రోలి సామ్రాజ్యమును రక్షించుకోవలెనని చాలా ప్రయత్నం చేశాడు. కాని మధుర, జింజీల నాయకులు ఇతనికి సహాయం చేయకుండా శత్రుత్వం వహించారు. అయినప్పటికీ ఈ రాయలు గోలకొండ సుల్తానుతో యుద్ధములు చేసి, అతనిని ఓడించి, అతడు కృష్ణ దాటి రాకుండా కట్టుదిట్టం చేశాడు.

పిమ్మట రెండవ శ్రీరంగరాయలు అధికారానికి వచ్చాడు. ఈ కాలంలో జగ్గారాయ డనే రాజబంధువు అనామకుడైన ఒక బాలుడిని వెంకటపతిరాయల కుమారుడని ప్రచారం చేసి, అతని పక్షాన అధికారం వశపరచుకున్నాడు. కొంతకాలం అయాక జగ్గారాయలు శ్రీరంగరాయలని చెరలో పెట్టి అతనిని సకుటుంబంగా హత్య చేయించాడు. కాని యాచమనాయడనే రాజభక్తుడు శ్రీరంగరాయల కుమారులలో ఒకడైన రామదేవ రాయలను చెరనించి తప్పించి, అతనిని దక్షిణదేశానికి తీసుకు వెళ్ళి అక్కడి నాయకుల సహాయం కోరాడు. మధుర, జింజీల నాయకులు ఇతనికి సహాయం చెయ్యకుండా జగ్గారాయల పక్షం చేరారు. తంజావూరి నాయకుడుమాత్రం రామదేవరాయలని ఆదరించి, గౌరవించి, అతనిని వెంటబెట్టుకొని యుద్ధానికి బయలుదేరాడు. మధుర, జింజీల నాయకులున్నూ, జగ్గా రాయలున్నూ తిరుచినాపల్లిదగ్గర ఉన్న తోపూరు వద్ద తంజా

వూరు సైన్యాన్ని ఎదురుకున్నారు. అక్కడ జరిగినయుద్ధంలో తంజావూరు నాయకుడు జయించి, యుద్ధభూమిలోనే రామ దేవరాయలకు పట్టాభిషేకం చేశాడు. ఈ రామదేవరాయలు ఒక వంక బిజాపుర సుల్తానుతో యుద్ధములు చేస్తూ, మరి ఒక వంక మధుర, జింజీల నాయకులను వశపరచుకోడానికి ప్రబలము లైన ప్రయత్నములు చేశాడు.

పిమ్మట మూడవ వెంకటపతిరాయలు రాజ్యానికి వచ్చాడు. ఈ కాలంలో బిజాపుర సుల్తాను మైసూరు రాజ్యాన్ని, గోలకొండ సుల్తాను మదరాసువరకూ గల కోస్తా ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. దక్షిణాన ఇద్దరు నాయ కులూ అలజడి కలిగిస్తూనే వచ్చారు. ఈ ప్రమాదములను తట్టుకోలేక వెంకటపతిరాయలు రాజ్యం వదిలిపెట్టి పోయాడు.

తర్వాత మూడవ శ్రీరంగరాయలు రాజు అయాడు. ఇతని కాలంలో పరిస్థితులు బాగా విషమించి పోయినవి. మధుర జింజీల నాయకులు ఇతనిని అనేకసార్లు యుద్ధములలో ఓడించారు. ఇతర నాయకులు ఎవరికి వారు స్వతంత్రులై పరిపాలన సాగించుకుంటూ ఈ రాయల సంగతి పట్టించుకో లేదు. బిజాపుర గోల్కొండ సుల్తానులు మరిఒకసారి విజృంభించి మరి కొంత భాగాన్ని స్వాధీనం చేసుకున్నారు. ఈ పరిస్థితు లలో గత్యంతరం లేక శ్రీరంగరాయలు రాజ్యం వదలి పారి పోయాడు. ఇంతటితో అప్పటివరకూ నామమాత్రంగా నిలిచి

ఉండిన విజయనగర సామ్రాజ్యం క్రీ. శ. 1652 లో అంత రించి కాలగర్భంలో లీనం అయిపోయింది.

ఈ విజయనగర సామ్రాజ్యం వర్ధిల్లిన కాలం దక్షిణ భారతదేశ చరిత్రలో చాలా ముఖ్యమైనది. ఈ కాలంలో మహమ్మదీయ సుల్తానులతో అనేక యుద్ధములు జరుగుతూ ఉండినా అవి తాత్కాలికంగా కొన్ని కొన్ని చోట్ల మాత్రం కలవరములు కలిగించాయి. కాని మొత్తంమీద శాంతి సుస్థిరంగా ఉండినది. దేశం అనేక విధముల పురోగమించింది. సంస్కృతి బహుముఖముల అభివృద్ధి చెందినది. అబ్దుర్ రజాక్, నికోలో కోంటీ, న్యూనిజ్, పేఇస్‌వంటి విదేశీయులు ఎందరో ఈ సామ్రాజ్యంలో సంచరించి ఆనాటి రాజుల పరిపాలనా దక్షతనీ, ప్రజలు అనుభవించిన భాగ్య భోగ్యములనూ అనేక విధముల ప్రశంసించారు.

ఈ నాటి రాజులు సర్వ స్వతంత్రులు అయి ఉండిన్నీ, ధర్మానుబద్ధంగా పరిపాలించారు. దేశాన్ని రక్షించడం, సంస్కృతినీ, హిందూ మతాన్నీ పెంపొందించడం వారికి ముఖ్య లక్ష్యములుగా ఉండేవి. సామ్రాజ్యం సువిశాలమైనది కావడం వల్ల విజయనగర రాజులు దానిని కొన్ని రాజ్యములుగా విభజించి పరిపాలించారు. అనేకమంది నాయకులు వివిధ ప్రాంతములకు అధిపతులుగా ఉండి దేశాన్నీ, ప్రజలనీ రక్షించే వారు. అనేకమంది మంత్రులు, సేనాపతులు, ఇతరోద్యోగులు గలిగి ప్రభుత్వ విధానం చక్కగా నిర్మించబడి ఉండేది.

సామ్రాజ్యంలో సుశిక్షితమైన సైన్యం ఉండేది. గొప్ప రాబడి ఉండడంవల్ల ప్రభుత్వం విద్యాపోషణ, ఆలయాది నిర్మాణం, కర్షకులకు కావలసిన వసతులను కలిపించడంవంటి పనులను విరివిగా తలపెట్టి సాగించేది.

ఈ నాడున్నూ వ్యవసాయం ప్రజలకు ముఖ్యవృత్తిగా ఉండేది. జీవిత ప్రమాణం బాగా హెచ్చు స్థాయిలో ఉండడం వల్ల ప్రజలకు జీవితావసరములు ఎక్కువగా కావలసి వచ్చినవి. అందువల్లనూ, ప్రభుత్వంయొక్క అవసరములవల్లనూ పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందినవి. ప్రజలవద్ద ధనం ఎక్కువగా ఉండడం వల్ల భోగ వస్తువుల ఉత్పత్తి ఒక ప్రత్యేక పరిశ్రమ అయింది. ఈనాడుకూడా కార్మికులూ, వర్తకులూ సమిష్టిగా జీవిస్తూ అనేక సంఘములద్వారా తమతమ వృత్తులను సాగించుకునే వారు. సామ్రాజ్యం తూర్పు పడమరల సముద్రంవరకూ వ్యాపించి ఉండడంవల్ల తీరం వెంబడి ఉండిన ఎన్నో రేవులు విదేశ వాణిజ్యం అభివృద్ధి పొందడానికి ఉపకరించేవి. ఈనాటి వర్తకులు సింహళం, సుమాత్రా, బోర్నియో, చైనా, పర్షియా, ఏడెన్‌వంటి దూర ప్రాంతములతో వర్తకం చేసేవారు.

ఈ కాలంలో చతుర్వర్ణములే కాక వాటిలో అనేక శాఖోపశాఖలు ఉండేవి. బ్రాహ్మణులు చాలామంది మంత్రులుగానూ, సేనానులుగానూ, లేఖకులుగానూ ప్రభుత్వోద్యోగములలో ఉండేవారు. రెడ్లూ, వెలమవారూ, కమ్మవారూ, బలిజీలు మొదలైనవారు సైన్యంలో చేరి నాయకులుగానూ,

సేనానులుగానూ కీర్తి గౌరవములను గడించారు. సుగంధ ద్రవ్యములనూ, వెండి బంగారములనూ, సన్న బట్టలనూ అన్ని వర్ణములవారూ తమతమ తాహతును బట్టి విరివిగా ఉపయోగించేవారు.

ఈ కాలంలో హిందూమతానికీ, హిందూ సంస్కృతికీ విజయనగర సామ్రాజ్యం ముఖ్యాధారంగా ఉండేది. ఈ నాటి రాజు లందరూ వైదిక ధర్మాన్నే అనుసరించారు. శైవమూ, వైష్ణవమూ, వీరశైవమూ బాగా వర్ధిల్లినవి. విద్యారణ్యస్వామి తన గ్రంథములద్వారా వైదిక ధర్మాన్ని పునరుద్ధరించాడు. శంకర, రామానుజ మాధ్వమతములకు చెందిన పీఠాధిపతులు అనేకమంది విజయనగర రాజుల ఆదరణని పొందారు. ఈ కాలంలో జైన మతమున్నూ కొంతవరకూ వ్యాప్తిలో ఉండేది. సామ్రాజ్య సైన్యంలోనూ, ఇతరత్రాకూడా అనేకమంది మహమ్మదీయులు ఉండి ఏ విధమైన ఆటంకమూ లేకుండా వారి మతాన్ని అనుసరించేవారు. అలాగే సామ్రాజ్యంలో అనేకచోట్ల క్రైస్తవులు తమ మతాన్ని ప్రచారం చేసుకునే వారు. ఈ యీ మతముల వారందరూ ఏ వైషమ్యమూ లేకుండా ఈ హిందూ సామ్రాజ్యంలో సుఖంగా నివసించేవారు.

విజయనగర సామ్రాజ్యం వర్ధిల్లిన కాలంలో అన్ని భాషలూ బాగా అభివృద్ధి నందినవి. సంస్కృత భాషలో అనేక మంది కవులూ, పండితులూ సారస్వతానికీ, వ్యాకరణానికీ, వేదాంతానికీ, సంగీత నాట్యములకూ సంబంధించిన గ్రంథము

లను ఎన్నిటినో రచించారు. ఈ కాలంలో, అందులో ముఖ్యంగా కృష్ణదేవరాయల కాలంలో ఆంధ్ర వాఙ్మయం బాగా వెంపొందింది. అలసాని పెద్దన, రామలింగకవి, ముక్కు తిమ్మన, రామరాజభూషణుడు మొదలైన మహాకవులు ఈ కాలంలో వర్ధిల్లారు. అలాగే కన్నడ తమిళ భాషలలోకూడా ఎన్నో గ్రంథములు ఈ కాలంలో రచించబడినవి.

విజయనగర రాజులు గొప్ప కళా పోషకులు. వారి ఆస్థానంలోనూ, సామ్రాజ్యంలోని ముఖ్య కేంద్రములలోనూ



విరూపాక్షాలయం-హాంపీ

అనేకమంది గాయకులూ, నర్తకులూ ఉండి అద్భుతమైన కళా

సేవ చేశారు. సంగీతమూ, నాట్యమూ బహువిధముల వృద్ధి చెందినవి.

ఈ కాలంలో వాస్తు శిల్పకళలు చక్కగా పెంపొందినవి. రాజధాని అయిన హంపీ-విజయనగరంలోనూ, పెనుగొండ, చంద్రగిరివంటి స్థలములలోనూ మంచి సౌధములు ఉండేవి. విజయనగరంలోనూ, తాడిపత్రి, లేపాక్షి, పుష్పగిరి, సోంపేట, మంగాపురం మొదలైనచోట్ల రమ్యములైన దేవాలయములు నిర్మింపబడినవి. వీటిలో చక్కని శిల్పమూ, మనోహరములైన చిత్రములూ కొన్ని ఆలయములలో నేటికినీ కనిపిస్తాయి. దక్షిణ భారతంలో అనేక చిన్న చిన్న ఆలయములను ఈనాటి రాజులు విస్తరించి వాటికి క్రొత్త శోభను కలిపించారు.

ఈ విధంగా ఈ విజయనగర సామ్రాజ్యం దక్షిణ భారతంలో బయలుదేరిన సామ్రాజ్యము లన్నిటిలోనూ అగ్రగణ్యమై, వాటిని అన్నిటినీ మించిన శోభను అనుభవించినది.



# గోలకొండ సుల్తానులు :

క్రీ. శ. 1347 లో దక్షిణాపథంలో స్థాపింపబడిన బహమనీ రాజ్యం త్వరలోనే బాగా విస్తరించింది. ఆ రాజ్యపు సుల్తానులు వెలమవారినీ, ఇతర హిందూ రాజులనూ ఓడించి నేటి తెలంగాణాని స్వాధీనం చేసుకున్నారు. కొండవీడు రాజ్యము ను రెడ్లు పరిపాలిస్తూ ఉండిన కాలంలో వీరు కోస్తాప్రాంతం మీద అనేకసార్లు దండెత్తి వచ్చారు. ఆ రెడ్డి రాజ్యం పడిపోయిన తరవాత వీరు ఈ ప్రాంతంలో కొంత భాగాన్ని స్వాధీనం చేసుకున్నారు. కడపటిబహమనీ సుల్తాను కాలంలో సుల్తాన్ ఖులీ అనే అతడు గోలకొండ కేంద్రంగా తెలుగు భాగానికి గవర్నరుగా ఉండి పరిపాలన చేశాడు. క్రీ. శ. 1518 లో ఆ సుల్తాను మరణించగానే ఎక్కడిగవర్నర్లు అక్కడ స్వతంత్రులు అయారు. కొద్దికాలానికి సుల్తాన్ ఖులీకూడాస్వతంత్రుడై



చార్ మినార్

తన వశంలో ఉండిన భూభాగానికి రాజు అయినాడు. స్వతంత్ర మహమ్మదీయ రాజ్యమైన గోలకొండరాజ్యం ఈ విధంగా స్థాపించబడింది. క్రమక్రమంగా ఆంధ్ర దేశం అంతా దానిలో చేరిపోయింది. ఈ విధంగా గోలకొండ కుతుబ్‌షాహీలది మూడవ ఆంధ్ర సామ్రాజ్యం అయింది.

సుల్తాన్ ఖులీ అదివరకే ఆంధ్ర ప్రాంతంతో పరిచయం కలిగి ఉండడంవల్ల ఇతడు తన అధికారాన్ని సులభంగానే సుస్థిరం చేసుకోగలిగాడు. ఆమీదట ఇతడు కృష్ణా, గుంటూరు జిల్లాలమీద కొన్ని దండయాత్రలు సాగించాడు. ఇతని వంశీయులకు ఖుతుబ్‌షాహీలని పేరు వచ్చినది. వీరిలో నాల్గవ సుల్తాను ఇబ్రహీం ఖుతుబ్‌షా. ఇతడు కొన్ని కుటుంబ కలహములు, కారణంగా గోలకొండ వదలి విజయనగరం వెళ్ళి, అక్కడ రామరాయల ఆస్థానంలో తల దాచుకోవలసి వచ్చింది. తుదకు ఆ రాయల సహాయంతోనే ఇతడు గోలకొండ సింహాసనం అధిష్టించగలిగాడు. కొంతకాలం రాయలతో సఖ్యంగా ఉండినా, తర్వాత ఈ సుల్తాను అప్పటి రాజకీయములను అనుసరించి రాయలయెడల శత్రుత్వం వహించాడు. రామరాయలు రెండు మూడుసార్లు దండెత్తివచ్చి ఇతనిని ఓడించాడు. తుదకు ఈ సుల్తాను, ఇతర సుల్తానులతో చేరి రక్కసి, తగడియుద్ధంలో రామరాయలకు ఎదురు నిలిచాడు. ఆ యుద్ధంలో రామరాయలు మరణించడంతో ఇతడు నిర్భయంగా విజృంభించాడు. తూర్పు తీరంమీద దండెత్తిపోయి ఇతడు చికాకోల్ నించి రాజ

మహేంద్రగిరివరకూ గల భాగాన్ని జయించాడు. మరి ఒక దండయాత్రలో ఇతనికి గుంటూరు, కర్నూలు జిల్లాలు వశం అయినవి.

పిమ్మట మహమ్మదు ఖులీ ఖుతుబ్ షా రాజ్యానికి వచ్చాడు. ఇతని తల్లి భాగీరథి అనే ఆంధ్ర స్త్రీ. ఇతని రాజ్య



గోలకొండ కోట

కాలం చాలాముఖ్యమైనది. ఈ కాలంలోవిజయనగరసామ్రాజ్యం క్రమక్రమంగా క్షీణిస్తూ ఉండడంవల్ల ఖుతుబ్ షాహీలు దానిలో చాలా భాగములను వశపరచుకుంటూ వచ్చారు. ఈ మహమ్మద్ ఖులీ రాజ్యకాలంలో ఇంగ్లండులో స్థాపించబడిన ఈస్ట్ ఇండియా కంపెనీ అనే వర్తక సంఘంవారి మనుషులు ఆంధ్ర దేశంలో కోస్తా ప్రాంతంలో కొన్ని వర్తక స్థానములు స్థాపించు

కున్నారు. అందుమూలంగా వారికి గోలకొండ సుల్తానులతో సంబంధం ఏర్పడింది. ఈ సుల్తానుకు తెలుగులో కవిత్వం చెప్ప గల పాండిత్యం ఉండేదట.

తర్వాత మహమ్మద్ ఖుతుబ్ షా, అబ్దుల్లా ఖుతుబ్ షా అనే సుల్తానులు రాజ్యం చేశారు. అబ్దుల్లా కాలంలో మీర్ జుమ్లా అనే గోలకొండ సేనాని కోస్తా ప్రాంతంలో కృష్ణానది నుంచి పులికాట్ సరస్సు వరకూ గల ప్రాంతాన్ని జయించాడు. అప్పటి మొగలు చక్రవర్తి అయిన షాజహాన్ పాదుషా ఫర్మానాను పురస్కరించుకొని ఈ సేనాని కడప చిత్తూరు జిల్లాలను కూడా జయించాడు. పిమ్మట అప్పటికి దక్కనులో మొగలు రాజ ప్రతినిధిగా ఉండిన ఔరంగజేబు అకారణంగా గోలకొండ మీద దండెత్తి వచ్చి చాలా కష్టనష్టములు కలిగించాడు.

గోలకొండ సుల్తానులలో అబుల్ హస్సన్ కడపటి వాడు. ఇతనికి తానాషా లేక తానీషా అనే పేరుకూడా ఉండేది. అక్కన్న మాదన్నలనే సుప్రసిద్ధులయిన తెలుగు సోదరులు ఇతని రాజ్యాన్ని చాలకాలం నడిపించారు. రామదాసు అని ప్రసిద్ధిచెందిన కంచర్ల గోపన్న ఈ కాలంలోనే భద్రాచలంలో తహసీలుదారుగా ఉండి ప్రభుత్వ ద్రవ్యంతో ఆ గ్రామంలో శ్రీరామాలయం కట్టించినట్లు తెలుస్తుంది. క్రీ. శ. 1687 లో అప్పటికి మొగలు చక్రవర్తి అయిన ఔరంగజేబు గోలకొండ మీద దండెత్తివచ్చాడు. ఖుతుబ్ షాహీ సైనికులు ఎంత ధైర్యంగా పోరాడినా ప్రయోజనం లేక పోయింది. మొగలులు తానీషాను

బందీని చేసి గోలకొండ నగరాన్ని ఆక్రమించారు. అంతటితో ఈ సామ్రాజ్యం నశించింది.

ఖుతుబ్ షాహీల పరిపాలనా కాలంలో ఆంధ్రదేశం అనేక విధముల అభివృద్ధి చెందింది. వారి సామ్రాజ్యంలో అన్ని మతములవారూ సుఖంగా ఉండేవారు. ఆ కాలంలో మత వైషమ్యం మచ్చుకైనా ఉండేదికాదు. ఇతర ప్రాంతములలోని మహమ్మదీయ పాలకులు మతేతరులైన తమ ప్రజలను అనేక విధముల బాధిస్తూ, వారి భాషాసంస్కృతులనూ, కట్టడములనూ శతవిధముల అణచివేస్తూ ఉండినరోజులలో ఈ ఖుతుబ్ షాహీ సుల్తానులు ప్రజలను అందరినీ, మతములను అన్నిటినీ సమానంగా ఆదరించారు. వీరు ఎన్నడూ తాము విదేశీయులమని అనుకోలేదు. తామూ తమ ప్రజలూ ఏకదేశీయులనే దృష్టితోనే వీరు తమ పరిపాలన సాగించారు. వీరు తాము అవలంబించిన ఇస్లాముతోపాటు హిందూమతాన్ని కూడా ఆదరించారు. పూజాపునస్కారములు నిలిచిపోయిన ఆలయములను పునరుద్ధరించడానికి వీరు విశేషంగా సహాయం చేశారు. భద్రాచలమూ, సత్రసాల మొదలయిన చోట్ల గల ఎన్నో ఆలయములకు జాగీరులూ, మడిమాన్యములూ ఇచ్చారు. మత వివక్షత లేకుండా యోగ్యులైన హిందువులను అనేకమందిని వీరు ఉన్నత పదవులకు నియమించారు. ప్రజలున్నూ ఈ సుల్తానుల యెడల భక్తిగౌరవములను చూపించి, వారికి పూర్వ హిందూరాజుల బిరుదములను ఇచ్చి సన్మానించారు.

ఈ గోలకొండ సుల్తానులు చక్కని పరిపాలనా విధానాన్ని ఏర్పరచారు. రాజభక్తులూ, సమర్థులూ అయిన ఉద్యోగులు పరిపాలనని జాగ్రతగా నిర్వహించారు. సుల్తానులూ, మంత్రులూ తరచుగా పర్యటనచేస్తూ ప్రజల యోగక్షేమమును విచారించేవారు. న్యాయశాఖలో ముస్లిం పండితులతో పాటు హిందూపండితులు కూడా ఉండి ధర్మశాస్త్రమును అనుసరించి తీర్పులు చెప్పేవారు. సామ్రాజ్యం అంతా కొన్ని సుభాలుగా విభజించబడి ఉండేది. ఒక్కొక్క సుభాలో సర్కారులు సమితులు, మొహల్లాలూ అనే విభాగములు ఉండేవి.

గోలకొండ రాజ్యం సిరి సంపదలకు ఆలవాలంగా ఉండేది. దీనిలోని ప్రజలకు వ్యవసాయం ముఖ్యవృత్తిగా ఉండేది. ఇతర వృత్తులలో వజ్రముల పరిశ్రమ చాలా లాభకరంగా ఉండేది. సామ్రాజ్యంలో చాలాచోట్ల వజ్రముల గనులు ఉండేవి. వీటిలో కొండపల్లి, నరసాపురం, కందికోట, కొల్లూరులలో గనులు బహు ప్రసిద్ధములు. తర్వాత ముఖ్యమైనది నేత పరిశ్రమ. అనేకచోట్ల, ముఖ్యంగా నరసాపురం, బందరు ప్రాంతములలో సన్నని బట్టలూ, రంగు బట్టలూ తయారు అయేవి. బందరులో చక్కని రంగులతో, మనోహరములైన అలంకారములతో కలంకారీలనే అద్దకపు బట్టలు తయారు అయేవి. ఈ వస్త్రములు విదేశములకు పెద్ద యెత్తున ఎగుమతి అయేవి. ఆనాడు ఆంధ్ర దేశపు వర్తకులు బందరు రేవు ద్వారా అరకాన్,

పెగూ, బర్మా, మలే వంటి దేశములతో విరివిగా వర్తకం సాగించేవారు.

ఆ నాడు ఖుతుబ్‌షాహీల ఆదరణలో పర్షయను, ఉర్దూ, తెలుగు భాషలూ, వాటిలో సాహిత్యమూ బాగా అభివృద్ధి చెందినవి. ఈ వంశపు సుల్తానులు అనేకమంది కవులూ, కవితా ప్రియులూ అయి అనేకమంది కవి పండితులను ఆదరించారు. మహమ్మదీయ పండితులు తెలుగు, సంస్కృత భాషలను నేర్చుకొని గ్రంథ రచన చేశారు.

సామ్రాజ్యం అభివృద్ధి కావడంతో గోలకొండ నగరంలో జనసమ్మర్దం ఎక్కువ అయింది. అందువల్ల మహమ్మద్ ఖులీ ఖుతుబ్‌షా ఆ నగరాన్ని అంటి, తన ప్రియురాలైన భాగామతీ లేక భాగ్యమతీ అనే హిందూ స్త్రీ పేర భాగ్యనగరం (హైదరాబాదు) అనే క్రొత్త నగరాన్ని నిర్మించాడు. ఈ నగరంలో అనేక రాజసౌధములూ, మహలులూ, చార్ మీనార్, మక్కా మసీదులవంటి కట్టడములూ ఎన్నో నిర్మించబడినవి.

ఈ విధంగా ఖుతుబ్‌షాహీ సామ్రాజ్యం సుమారు ఒకటిన్నర శతాబ్దులకాలం సాగింది.

## నైజాముల పరిపాలన :

ఔరంగజేబు చక్రవర్తి గోలకొండ రాజ్యాన్ని జయించడంతో దానిలో చేరి ఉండిన ఆంధ్రదేశం మొగలు సామ్రాజ్యంలో భాగం అయింది. అనంతరం మొగలు పాదుషా అయిన ఫరుక్ షయార్ అసఫ్ జా అనే సర్దారును నిజాం ఉల్ ముల్క్ అనే బిరుదుతో దక్కనుకు సుబేదారుగా నియమించాడు.



మొదటి అసఫ్జా

తర్వాత మొగలు చక్రవర్తుల ఆస్థానంలో అనేక అంతః కలహాములూ, కుట్రలూ బయలుదేరి చక్రవర్తుల అధికారం నామమాత్రం అయినది. ఈ పరిస్థితులలో ఢిల్లీలో ఉండలేక అసఫ్జా

దక్కనుకు వచ్చి, క్రీ.శ. 1724 నుంచీ పాదుషాలతో నిమిత్తం లేకుండా స్వతంత్రంగా పరిపాలించడం ఆరంభించాడు. ఇతడు ఈ విధంగా ప్రారంభించిన రాజ్యానికి నిజాం రాజ్యం అని పేరు వచ్చింది. ఇతని తర్వాత పరిపాలన చేసిన ఇతని సంతతి వారికి నైజాములని పేరు వచ్చింది.

ఈ కాలంలో పీష్వాల నాయకత్వంక్రింద మహారాష్ట్రులు విజృంభించి దేశం అంతటా గొప్ప పలుకుబడి సంపాదించారు. వారికిన్నీ నైజాములకిన్నీ అనేక యుద్ధములు జరుగుతూ వచ్చినవి. దక్షిణాన ఇంగ్లీషువారూ, ఫ్రెంచివారూ అనేక వర్తక స్థానములు స్థాపించుకొని వర్తకం సాగించుకుంటూ వచ్చారు. క్రమంగా వారు తమ తమ దేశములకు ఐరోపా ఖండంలో యుద్ధములు వచ్చినపుడల్లా మన దేశంలో కూడా యుద్ధములు సాగిస్తూ వచ్చారు. ఇక్కడి రాజులు తమలో తమకు సాగిన కలహములలో ఈ విదేశీయుల సహాయం కోరుతూ వచ్చారు. ఆ విధంగా నైజాములకున్నూ ఈ విదేశీయులకున్నూ సంబంధములు ఏర్పడి అవి ఎవరున్నూ అనుకోని మార్పులకు దారి తీసినవి.

మొదటి నైజాం అయిన నిజాం ఉల్ ముల్క్ కాలంలో అతనికి లోబడి నెల్లూరు చిత్తూరు జిల్లాలను ఆర్కాటు నవాబున్నూ, కొండవీడు కొండపల్లి ఏలూరు, రాజమండ్రి, చికాకోలు అనే కోస్తాభాగంలోని ఐదు సర్కారులను ఒక్కొక్క

సర్కారును ఒక్కొక్క నవాబున్నూ పరిపాలిస్తూ ఉండేవారు. కడప కర్నూలులలో మరి ఇద్దరు నవాబులు ఉండేవారు."

నిజాం ఉల్ ముల్క్ అనంతరం నాజిర్ జంగు నైజాం అయినాడు. అతనికిన్ని ముజఫరు జంగుకున్నూ రాజ్యం కొరకు తగవులు వచ్చినవి. ఈ కాలంలో దక్షిణదేశంలో ఫ్రెంచివారి వర్తక స్థానములకు డూప్లే అనే అతడు గవర్నరు జనరలుగా ఉండేవాడు. ఫ్రెంచి వారి అధికారమును వీలయినంతవరకూ విస్తరించడమే లక్ష్యంగా పెట్టుకున్న డూప్లే ఈ తగవులలో కలిపించుకున్నాడు. ఒకప్పుడు నాజరుజంగు దక్షిణదేశంలో ఉన్న జింజీకోటని ముట్టడించాడు. ఆ ముట్టడిలో కడపనవాబు ఇతనిని చంపివేశాడు. వెంటనే డూప్లే ముజఫరు జంగును నైజాంగా ప్రకటించి, బుస్సీ అనే సేనానితో కొంత ఫ్రెంచి సైన్యాన్ని ఇచ్చి అతనిని తన రాజధానికి పంపించాడు. కాని దారిలో కర్నూలునవాబు ఈ ముజఫరు జంగును చంపివేశాడు. వెంటనే బుస్సీ ముజఫరుజంగు తమ్ముడయిన సలాబత్ జంగును నైజాంగా ప్రకటించి అతనిని సురక్షితంగా రాజధానికి చేర్చాడు.

సలాబత్ జంగుతో కలసి ఇక్కడికి వచ్చిన ఫ్రెంచి సేనాని అయిన బుస్సీ ఇక్కడనే తన సైన్యంతో నిలిచిపోయాడు. ఇతని సహాయమూ, సలహా లేనిదే ఏ పనీ జరగకపోవడం వల్ల నైజాం బుస్సీని తన వద్దనే ఉంచుకున్నాడు. కొంత కాలం అయాక మంత్రులకి బుస్సీ యెడల అసూయ కలిగి ఈ

ఫ్రెంచి సైన్యం పోషణకుగాను అయే ఖర్చులను ఇయ్యడం మానివేశారు. ఒక వైపునుంచీ వీలయినంత వరకూ ఫ్రెంచి వారి అధికారాన్ని, పలుకుబడినీ విస్తరించమని డూప్లే బుస్సీని వత్తిడి చేస్తూ వచ్చాడు. ఈపరిస్థితులలో బుస్సీ నైజాంను బలవంత పరచి ఫ్రెంచి సైన్యపు పోషణ నిమిత్తం కోస్తా ప్రాంతంలో ఉండిన నాలుగు ఉత్తర సర్కారులను సంపాదించాడు. ఈ విధంగా చికాకోల్, రాజమండ్రి, ఏలూరు, కొండపల్లి సర్కారులు ఫ్రెంచి వారికి వశం-అయి క్రీ.శ. 1753లో బుస్సీ పరిపాలనలోకి వచ్చినవి.

ఈ ఉత్తర సర్కారులను ఐదు సంవత్సరములైనా పరిపాలించకుండానే బుస్సీ నైజాం రాజ్యం నించి వెళ్ళిపోవలసి వచ్చింది. క్రీ. శ. 1758లో ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని ఇంగ్లీషు కంపెనీ వారు ఈ సర్కారులను బలిమిచేత స్వాధీనం చేసుకున్నారు.

తరువాత నిజాం ఆలీఖాన్ రాజ్యానికి వచ్చాడు. ఈ కాలంలో మైసూరులో హైదరలీ అనే సైనికుడు విజృంభించి, ఆ రాజ్యపు మహారాజును త్రోసి పుచ్చి అధికారం చేత చిక్కించుకున్నాడు. ఒకప్పుడు నైజాం బలవంతుడైన హైదరలీతో ఒక ఒడంబడిక చేసుకోవలసి వచ్చింది. దానిని అనుసరించి హైదరు కడపకర్నూలు జిల్లాలను వశపరచుకున్నాడు. హైదరు అనంతరం అతని కుమారుడు టిప్పుసుల్తాను మైసూరు రాజ్యమును పరిపాలించాడు. అప్పటికి ఫ్రెంచి వారి అధికారం క్షీణించి

పోయి ఇంగ్లీషు కంపెనీ వారు బలవంతులైనారు. ఈ కంపెనీ వారున్నూ, నైజామున్నూ కలసి టిప్పుసుల్తానుతో యుద్ధములు చేశారు. వాటిలో కడపటి యుద్ధంలో టిప్పు మరణించాడు. ఆ తర్వాత టిప్పు రాజ్యాన్ని కంపెనీవారున్నూ, నైజామున్నూ పంచుకున్నారు. ఈ పంపకంలో కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలు నైజాముకు వచ్చినవి. మరి కొంతకాలానికి కంపెనీ వారు సైన్య సహకార పద్ధతి అనే ఒక పద్ధతిని అమలులో పెట్టారు. నైజాం దీనిలో చేరి, తన రాజధానిలో అవసరం అయినప్పుడు సహాయం చేసే నిమిత్తం ఒక కంపెనీ సైన్యాన్ని ఉంచుకొని, దాని ఖర్చులకుగాను కంపెనీ వారికి కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి జిల్లాలను ఇచ్చివేశాడు. ఇందు వల్లనే ఈ జిల్లాలకు "దత్త మండలములు" అని పేరు వచ్చినది.

ఈ విధంగా కోస్తాప్రాంతం మీదా, నేటి రాయల సీమ ప్రాంతం మీదా నైజాముల అధికారం తొలగిపోయి ఒక్క తెలంగాణా భాగం మీదనే ఇంతటినించీ, నిన్న మొన్నటిదాకా సాగుతూ వచ్చింది.

# కంపెనీవారి పరిపాలన :

క్రీ. శ. 15వ శతాబ్ది మధ్యభాగం వరకూ ఐరోపా ఆసియా ఖండముల మధ్య వర్తకం విరివిగా సాగుతూ ఉండేది. ఈ రెండు ఖండములకూ రాక పోకల నిమిత్తం కొన్ని భూ మార్గములు ఉండేవి. ఈ మార్గములు కాన్‌స్టాంటి నోపుల్ అనే నగరం వద్ద కలిసేవి. మహమ్మదీయులు ఈ నగరమును ఆక్రమించి ఐరోపా వర్తకులు ఆసియా ఖండంలోని దేశాలకు పోకుండా అడ్డు పెట్టారు. అందు వల్ల ఐరోపాలోని ప్రజలకుఆసియా నించి వచ్చే వస్తువులు లభించక చాలా ఇబ్బంది కలిగింది. ఆనాడు వారిలో అనేకమంది సాహసులు బయలుదేరి సముద్రముల మీద ప్రయాణం చేసి ఆసియా ఖండ



వాస్కోడి గామా

మును చేరడానికి కొత్తమార్గములను కనిపెట్టడానికి అనేకప్రియత్నములుచేశారు. తుదకు పోర్చుగల్ అనే దేశపుప్రభువు సహాయంతో వాస్కోడిగామా అనేఅతడు సముద్రమార్గాన భారత దేశంలో పడమటి తీరాన ఉన్న మలబారు చేరాడు. దీనితో ఐరోపాలో పెద్ద సంచలనం కలిగింది. ఇంతటినించి పోర్చుగీసు వారు గోవాను కేంద్రంగా చేసుకొని మనదేశంతో వర్తకం

సాగిస్తూ వచ్చారు, క్రీ.శ. 17వ శతాబ్దిలో ఐరోపాలోని ఇతర దేశముల వర్తకులు అనేక సంఘములుగా ఏర్పడి ఆసియాలోని దేశములతో వర్తకం సాగించడం ప్రారంభించారు. ఈ యీ దేశముల వర్తకులు ఆంధ్రదేశంతో సంబంధం ఏర్పరచుకున్నారు.

ఐరోపా ఖండంలో హాలెండు అని ఒక దేశం ఉన్నది. ఆ దేశం వారికి డచ్చివారు అని పేరు. ఈ డచ్చి వర్తకులు కొందరు ఆంధ్ర దేశంలో జగన్నాయక పురం, పాలకొల్లు, మచిలీ పట్టణం, పులికాట్ వంటి చోట్ల వర్తకస్థానములు ఏర్పరచుకున్నారు. కాని వీరు ఇంగ్లీషు వర్తకుల ధాటికి ఆగలేక ఈ స్థానములను వదలిపెట్టి వెళ్ళిపోయారు. ఫ్రాన్సు అనే మరి ఒక దేశం నించి వచ్చిన వర్తకులు యానాంలోనూ, మచిలీ పట్టణంలోనూ వర్తకస్థానములు ఏర్పరచుకున్నారు. ఇంగ్లండులో ఈస్టు ఇండియా కంపెనీ అనే పేర ఒక వర్తక సంఘం ఏర్పడి, ఈ కంపెనీవారు ఆంధ్రదేశంలో వీరవాసరం, నరసాపురంలలో వర్తక స్థానములు ఏర్పాటు చేసుకున్నారు. తరవాత వీరు మదరాసులో సెంటు జార్జి కోటను కట్టుకుని దక్షిణదేశంలో దానిని తమ కేంద్రంగా చేసుకున్నారు. ఫ్రెంచివారు పుదుచ్చేరిని కేంద్రంగా చేసుకున్నారు. ఈ విధంగా ఇంగ్లీషువారూ ఫ్రెంచివారూ మన దేశంలో పక్క పక్కని ఉంటూ, వర్తకం చేసుకుంటూ ఉండేవారు. క్రీ.శ. 18వ శతాబ్ది రెండవభాగంలో ఈ రెండు దేశములకూ అనేక యుద్ధములు జరిగినవి. ఆ సమయంలో ఇక్కడ ఉండిన ఇంగ్లీషు, ఫ్రెంచి వర్తకులు

దేశీయ రాజుల మీద పలుకుబడి సంపాదించి, వారి సహాయంతో తమలోతాము యుద్ధములు చేస్తూవచ్చారు. క్రీ.శ. 1753లో నైజాం వద్దనించి ఫ్రెంచి సేనాని బుస్సీ ఉత్తర సర్కారులను సంపాదించడంతో ఫ్రెంచి వారిది పై చెయ్యి అయినది. బుస్సీ ఈ సర్కారులకు వచ్చి వాటిని వశపరచుకున్నాడు. ఈ సందర్భంలో ఇతనికి విజయనగరం రాజు అయిన విజయరామరాజు సహాయం చేశాడు.

మరి ఐదు సంవత్సరములకు ఇంగ్లీషు వారికీ, ఫ్రెంచి వారికీ యుద్ధం వచ్చి, బుస్సీ నైజాం రాజధానినించి వెళ్ళిపోవలసి వచ్చింది. ఈ కాలంలో ఆనందగజపతి అనే విజయనగరం రాజు అప్పుడు కలకత్తాలో ఇంగ్లీషు కంపెనీ వారి గవర్నరుగా ఉండిన క్లైవుకు ఉత్తర సర్కారులను వశపరచుకోమనీ, తాను సహాయం చేస్తాననీ కబురు చేశాడు. క్లైవు ఫోర్డు అనే తాబేదారును కొంత సైన్యంతో ఇక్కడికి పంపించాడు. ఈ ఫోర్డు విశాఖపట్టణం నించి దక్షిణంగా వచ్చి, కొందూరు అనే చోట ఒక ఫ్రెంచి సైన్యాన్ని ఓడించాడు. అక్కడినించి పారిపోతున్న ఆ సైన్యాన్ని వెంట తరుముతూ అతడు రాజమండ్రి, ఏలూరు మీదుగా మచిలీపట్టణం చేరి అక్కడి కోటని ముట్టడించాడు. తన మిత్రులైన ఫ్రెంచి వారిని రక్షించే నిమిత్తం నైజాము ఒక సైన్యంతో ఈ ప్రాంతానికి వచ్చి, బెజవాడలో ఆగాడు. ఈలోగా మచిలీపట్టణం ఫోర్డుకు వశం అయింది. గత్యంతరంలేక

80 మైళ్ళ కోస్తా ప్రాంతమును ఇంగ్లీషు వారికి ఇచ్చి, నైజాం ఫోర్డుతో సంధి చేసుకున్నాడు.

ఉత్తర సర్కారులు నైజాం రాజ్యంలోనివి అందువల్ల తాము వాటిని బలిమిచేత ఆక్రమించినా, కంపెనీ వారికి నైజాం ఉత్తరువు అవసరం అయింది. కంపెనీ వారు ఎన్ని విధముల ప్రయత్నించినా నైజాం వారికి ఆ ఉత్తరువు ఇయ్యలేదు. తుదకి క్లైవు అప్పటి మొగలు చక్రవర్తి వద్దనించి, ఈ సర్కారులు కంపెనీ వారికి దానం చెయ్యబడినట్లు ఒక పట్టా సంపాదించాడు. మరి ఒక మార్గం లేక నైజాం కంపెనీ వారికి సర్కారులను ఇస్తూ ఒక ఫర్మానా జారీ చేశాడు. మరి కొంత కాలానికి కంపెనీ వారికి కొండపీడు సర్కారు కూడా వశం అయింది. ఇందువల్ల వారికి దక్షిణాన ఉండిన మదరాసు ప్రాంతమునూ, ఉత్తరాన ఉండిన బెంగాలునూ కలిపే ఐదు ఉత్తర సర్కారులూ అమూల్యమైన ఆస్తి అయి వారి ఆదాయం బాగా అభివృద్ధి చెందింది.

క్రీ.శ. 1857వ సంవత్సరం వరకూ కంపెనీవారు ఈ ఉత్తర సర్కారులనూ, దత్తమండలములనూ, ఆర్కాటు నవాబు రద్దు కావడంవల్ల లభించిన నెల్లూరు, చిత్తూరు జిల్లాలనూ పరిపాలిస్తూ వచ్చారు. ఈ ప్రాంతంలో శాంతిని నెలకొలిపి, వారు సక్రమమైన పరిపాలనా విధానాన్ని ఏర్పరచారు. జమీందారుల వల్ల ఏ విధమైన అలజడీ కలగకుండా వారిని అదుపులో ఉంచారు. క్రీ.శ. 1858 నించీ కంపెనీ వారి పరిపాలన అంతం

అయి భారత దేశం యావత్తూ ఇంగ్లండు ప్రభుత్వం యొక్క అధికారంలోకి వచ్చింది. కంపెనీ వారు ఈ ఆంధ్రభాగాన్ని దక్షిణ దేశంలో తమకు లభించిన ఇతర ప్రాంతములతో కలిపి, ఒక రాష్ట్రంగా ఏర్పరచి, దీనికి మదరాసును కేంద్రంగా చేసుకొని పరిపాలించారు. తరవాత కూడా ఈ కోస్తా ప్రాంతమూ రాయలసీమ భాగమూ మదరాసు రాష్ట్రంలోనే ఉంటూ వచ్చినవి. తెలంగాణా నైజాముల యేలుబడిలో ఉంటూ వచ్చినది.

---

## ఇటీవలి చరిత్ర :

19వ శతాబ్ది కడపటి పాదంనించీ ఆంధ్ర దేశంలో ప్రశంసనీయమైన చైతన్యం బయలుదేరింది. అనేక రంగము లలో క్రొత్త క్రొత్త ఉద్యమములు బయలుదేరి దేశాభివృద్ధికి దోహదం కలిపించాయి. 20వ శతాబ్ది ప్రారంభంనించీ రాజకీయోద్యమములు సాగినవి. వీనితోపాటు ఆంధ్రోద్యమము కూడా సాగినది. వీటికి ఫలితంగా భారత దేశానికి స్వాతంత్ర్యం లభించింది. ఆంధ్రులకి ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పడడం ద్వారా నూతనమైన వ్యక్తిత్వం లభించింది.

19వ శతాబ్ది కడపటి పాదంలో విద్యాధికులైన భారతీయులు కొందరు కలసి ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అనే ఒక సంస్థను స్థాపించారు. దాని సమావేశములలో ఆనాటి పెద్దలు అప్పటి రాజకీయ పరిస్థితులను చర్చించి, తమ అభిప్రాయములను ఇంగ్లీషు ప్రభుత్వము వారికి తెలియ చేస్తూ, రాజకీయ సంస్కరణలను కోరుతూవచ్చారు. అప్పటికీ ఆంధ్ర ప్రముఖులు అనేకులు ఈ సంస్థతో సన్నిహితమైన సంబంధం ఏర్పరచుకొని దీనికి చేతనైన బలం చేకూరుస్తూ వచ్చారు. 1918లో ఈ కాంగ్రెసుకు ఆంధ్రశాఖ ఒకటి ఏర్పడింది, గాంధీజీ



మహాత్మగాంధీ

ప్రారంభించి సాగించిన సహాయనిరాకరణోద్యమం ఆంధ్రదేశంలో అద్భుతమైన సంచలనం కలిగించింది. అనేక మంది యువకులూ విద్యార్థికులూ ఈ ఉద్యమంలో చేరి దీనిని విరివిగా ప్రచారం చేశారు. అనేకులు జైళ్ళకు పోయి, బ్రిటిష్ ప్రభుత్వం పెట్టిన బాధలకు లోనైనారు. పన్నుల నిరాకరణ, స్వరాజ్య పతాకోద్యమమూ మొదలయిన ఇతర ఉద్యమములను కూడా ఆంధ్రులు పట్టుదలతో సాగించారు. సైమను కమిషను బహిష్కారణోద్యమంలోనూ, ఉప్పు సత్యాగ్రహంలోనూ ఆంధ్రదేశం యావద్భారత విఖ్యాతిని పొందింది. అలాగే బ్రిటిష్ వారిని వైదొలగి పొమ్మని అనే క్విట్ ఇండియా ఉద్యమంలో ఆంధ్ర యువకులు ప్రశంసనీయమైన పాత్రని నిర్వహించారు. ఈ జాతీయోద్యమం సాగిన రోజులలో ఖాదీ ఉత్పత్తి విరివిగా సాగింది. దేశంలో ఎన్నో జాతీయ సంస్థలు బయలు దేరినవి.

ఈ శతాబ్ది మొదటి దశకంలోనే మన దేశంలోని వివిధ ప్రాంతములు అభివృద్ధి పొందవలెనంటే అక్కడక్కడ నివసించే ప్రజల భాషలని బట్టి రాష్ట్రములను ఏర్పరచడం అవసరమని ఆంధ్రదేశంలో ఒక ఉద్యమం బయలుదేరింది. ఈ భాషారాష్ట్రముల నిర్మాణం కొరకూ, అందులో ఒక భాగంగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రం యొక్క నిర్మాణం కొరకూ కృషి చేసే నిమిత్తం ఆంధ్ర మహాసభ అనే ఒక సంస్థ బయలుదేరింది. ఇంతటి నించీ జాతీయోద్యమంతోపాటు ఈ ఆంధ్రోద్యమం కూడా నిరంతరంగా సాగుతూ వచ్చినది. ఒక వంక దేశంలో ఆంధ్రరాష్ట్రం

యొక్క ఆవశ్యకతని గురించి ప్రచారం సాగుతూ వచ్చినది. మరి ఒక వంక ఆంధ్ర ప్రముఖులు బ్రిటిష్ ప్రభుత్వం వద్దకీ, ఇంగ్లండులో వివిధ రాజకీయ పక్షముల వద్దకి రాయబారములు తీసుకొని వెళ్ళి, రాష్ట్ర నిర్మాణావశ్యకతని గురించి వారికి నచ్చచెప్పడానికి ప్రయత్నం చేశారు. మరి ఒక వంక మదరాసు శాసన సభలోనూ, ఢిల్లీలోని కేంద్ర శాసనసభలోనూ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును గురించి ఆంధ్ర ప్రతినిధులు అనేక సార్లు తీర్మానములు ప్రవేశ పెట్టారు. ఈ ఆంధ్రరాష్ట్రోద్యమం ఒకప్పుడు ఆశాజనకంగానూ, మరొకప్పుడు ఆశాభంగకరంగానూ సాగుతూ వచ్చింది.

1938 లో ఒకసారి, 1947 లో మరి ఒక సారి మదరాసు శాసన సభలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణ తీర్మానములు ఆమోదింపబడినవి. 1947-48లో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం యొక్క ఆవశ్యకత అంగీకరింపబడి, దానిని ఎట్లా నిర్మించడం అనే అంశం చర్చకి వచ్చింది. ఆ మీదట మదరాసునగరం ఈ రాష్ట్రంలో చేరవలెనా లేదా అనే అంశమును గురించి వాదోప వాదములు జరిగినవి. కాని మరి నాలుగు సంవత్సరముల కాలం ఏ పనీ జరగకుండా ఈ వ్యవహారం స్తంభించి పోయింది. దేశంలో సైన్యముల అసంతృప్తి ప్రబలంగా వ్యాపించినవి. 1952 డిశంబరులో శ్రీ పొట్టి శ్రీరాములుగారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం వెంటనే జరగించవలెననే సంకల్పంతో, ఆమరణోపవాసం చేసి ప్రాణత్యాగం చేశారు. దీనితో బ్రహ్మాండమైన సంచలనం

కలిగింది. భారతదేశ ప్రధాని త్వరలోనే ఈ రాష్ట్రం ఏర్పడుతుందని సకాలంలో ప్రకటన చెయ్యడంతో దేశంలో శాంతి ఏర్పడింది. 1953వ సంవత్సరం 1వ తేదీ నాడు కర్నూలు తాత్కాలిక రాజధానిగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రం అవతరించింది.

ఆంధ్రులతోపాటు ఇతర భాషలవారున్నూ తమకు కూడా భాషాప్రాంతములు కావలెనని ఆందోళన చేస్తూ వచ్చారు. ఆంధ్రులలో కేవలమూ కోస్తాభాగాన్నీ, రాయలసీమ ప్రాంతాన్నీ కలిపి ఒక రాష్ట్రంగా ఏర్పరచినంత మాత్రాన తమ ఆశయం సిద్ధించలేదనీ, అప్పటికి ఇంకా హైదరాబాదు రాజ్యంలో చీలి ఉండిన తెలంగాణాను కూడా కలిపి విశాలాంధ్ర రాష్ట్రమును ఏర్పరచడం అవసరమనీ ఒక ఉద్యమం బయలు దేరింది. ఇంతలో భారతదేశ ప్రభుత్వం భాషలనుబట్టి రాష్ట్రములను ఏర్పరచడం న్యాయమని గుర్తించి, అందుకొరకు అవలంబించవలసిన కార్యక్రమమును నిర్ణయించడానికి ఒక సంఘమును నియమించింది. ఇంతటినించీ హైదరాబాదు రాజ్యం అలాగా ఉండవలెనా లేక విడగొట్టబడి, అందులోని భాషా ప్రాంతములు చుట్టూ ఉన్న సజాతీయ భాషా ప్రాంతములలో చేర్చబడవలెనా అనే సమస్యని గురించి వాదోపవాదములు జరిగినవి. తెలంగాణాను ఆంధ్రరాష్ట్రంలో చేర్చడమును గురించి ఆంధ్రనాయకులు పరస్పరమూ సంప్రతించి తుదకి దానిని కూడాచేర్చి ఒక అఖండమైన ఆంధ్ర ప్రాంతమును ఏర్పరచవలెననే నిర్ణయానికి వచ్చారు. ఈ నాయకుల నిర్ణయమును ఆమోదించి భారతదేశ ప్రభుత్వంవారు 1956వ సంవత్సరం నవంబరు